# విషయానుక్రమణిక
## 11 అక్టోబరు 1950





## టామ్ సాయర్

మార్క్ ట్వేన్ అనే సుప్రసిద్ధ అమెరికను కథకుని జగద్విఖ్యాత నవల "టామ్ సాయర్" అనువాదం పై వారంనుంచీ, అనగా 18 అక్టోబరునుంచీ, ఆంధ్ర పత్రిక సచిత్రవారపత్రికలో "బొమ్మరిల్లు" శీర్షిక క్రింద సీరియల్‌గా వెలువడుతుంది. మా పాఠకులు దీనిని విడవకుండా మొదటినుంచి చివరదాక చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాము.

సంపాదకుడు

# ఆంధ్రపత్రిక


సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతి
4 అణాలు

ప్రతిబుధవారము
ప్రకటింపబడును
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **5**

విక్రుతి సంవత్సర భాద్రపద బహుళ అమావాస్య బుధవారము




మైత్రేయ బోధిసత్వుడు జౌలియా శిధిలాలలో లభించిన శిలాప్రతిమ.





ఛాయాచిత్రకారుడు
శ్రీ కె. ఎ. పతి

# మనదేశం

**నియోజక వర్గాలు**

రాబోయే ఎన్నికలకోసం చెన్నరాష్ట్రాన్ని వివిధ నియోజకవర్గప్రాంతాలుగా విభజించి మద్రాసుప్రభుత్వం ప్రచురించింది. దీనిపైన "మద్రాసు రాష్ట్ర నియోజకవర్గ పరిశీలకసంఘం" (అనంతశయనం అయ్యంగార్ కమిటీ) పరిశీలన జరిపింది. మద్రాసు ఎసెంబ్లీ చర్చ జరిపింది. ఎసెంబ్లీలో ఎప్పుడూ ఉపన్యాసా లిచ్చేవారే పంపకాల్ని విమర్శిస్తూ ఉపన్యాసా లిచ్చారు. మంత్రివర్గం తమ పక్షానికి చెందిన అభ్యర్థుల్ని దృష్టిలో పెట్టుకుని స్వార్థబుద్ధితో పంపకంచేసిందని విమర్శించారు. అసలటువంటిది బొత్తిగా లేదని మంత్రి గోపాలరెడ్డిగా రన్నారు. అయితే అటువంటిది ఉందని చెప్పడానికి ఎంత ఆధారం వుందో, లేదని వాదించడానికీ అంతే ఆధారం వుంది. కాని ఈ పంపకాల్లో జిల్లాల్నీ తాలూకాల్నీ ఫిర్కాల్నీ ముక్కలు ముక్కలు చేసి పోసుపోసి గవ్వలాడ్డం ఎందు కవసరమయిందో మంత్రివర్గం సంజాయిషీ చెప్పలేకపోయింది. ఆ సంజాయిషీ చెప్పనంతవరకూ గోపాలరెడ్డిగారు శాసనసభలో ఎలాటి ఉపన్యాసా లిచ్చినా ప్రజల్ని తృప్తిపరచలేరు. విశ్వాసం కలిగించలేరు.

ఇంక బహుజనసభ్యత్వ నియోజకవర్గాలుండకూడదని చేసిన నిశ్చయానికి తిరుగులేదు. మతికల్లోలభయం, కమ్యూనిస్టు భయాలతో పీడకలలు కంటున్న కాంగ్రెస్ వారికి దానివల్ల కలగగల అపకారాలే కనిపిస్తాయికాని సుగుణాలు కనిపించవు. హరిజనుల సీట్లు రిజర్వేషన్ తప్ప, అన్నీ ఏకసభ్యత్వ నియోజకవర్గాలే ఏర్పాటుచేశారు. దీనివల్ల ఓట్లు చెడిపోకుండా ముక్కుకి సూటిగా పోయి ఎన్నికల్లో గెలవడానికి వీలుంది. అయినా ముక్కుకి సూటిగా పోయే ధైర్యంకూడా వీ రెవ్వరికీ లేదనే విషయం కాంగ్రెస్ పంచాయతీఎన్నికలే నిరూపించాయి.

**ఎన్నికల్లో క్రమం, అక్రమం**

ఎన్నికలు జరపడానికి కొన్ని నియమాలువిధిస్తూ భారతప్రభుత్వం ఒక శాసనాన్ని తలపెట్టింది. ఎన్నికసమయాల్లో ఏది అక్రమప్రవర్తనగా పరిగణించబడుతుందో నిర్వచించబడింది. వోటర్లని ఏను గెక్కించి నట్టుగా కార్లెక్కించి పోలింగ్ స్టేషన్లకి తీసుకుపోకూడదు. ఇదివరలో అయితే ఒంటెద్దుబండి ఎక్కడం ఎరగనివాళ్లని కూడా ఇంటికి కారుతీసుకొచ్చి వాళ్లని కారెక్కించి, పోలింగ్ స్టేషన్‌కి తీసుకుపోయి తమపక్షాన వోటు వేయించి, ఆ స్టేషన్ దగ్గిర వొదిలేసేవారు. నవ్వుతూ కారెక్కి వచ్చిన వోటర్లు పోలింగ్ స్టేషన్ నించి కాళ్లీడ్చుకుంటూ ఇంటికి నడిచి వెళ్లేవారు. ఇప్పుడల్లా చేస్తే అది నేరం కింద లెక్క. చాటుగా మాటుగా గుసగుసలాడి "మనవాడు (అంటే మన కులంవాడు) మనవాడికి వోటివ్వకపోతే ఇంకెవరి కిస్తావు" అని నయానకాని భయానకాని దబాయించకూడదు. మతం కులం వర్గం, పార్టీలు, కత్తులే ప్రచారంచేసి కాన్వాస్ చెయ్యకూడదు. ఒకరిపేరు చెప్పి మరొకరు వోటు వెయ్యడం మొదలైనవి శిక్షించవలసిన నేరాలుగా పరిగణించబడతాయి. అయితే ఒకచోట అణిస్తే కొత్త రూపాల్లో మరొకచోట తలెత్తే వ్యాపార దుర్నీతిమాదిరిగానే, ఇలాటి అక్రమాలు ఈ రూపంలో కాకపోతే మరో రూపంలో తలెత్తక మానవు, మన రాజకీయాలు మారకుండా ఉన్నంతవరకూ, 'వోటుంటేనే మనిషి, వోటు వేస్తేనే పౌరుడు' మొదలైన నినాదాల్ని కట్టిపెట్టి 'ఏ విషయాల్ని దృష్టిలో పెట్టుకొని వోటు వెయ్యాలి' అనే తరహా నేర్పాలే కాని, వోటుకి నికరమైన విలువెంతో దాని అవసరమేమిటో, అది చెయ్యగల పనేమిటో తెలియనంతకాలం వోటనేది కోతికి కొబ్బరికాయ దొరికినట్టే అవుతుంది. (రాజకీయ మంత్రతంత్రాలు నేర్చినవారికి ప్రజాస్వామ్యం దొరికినట్లు.)

**బియ్యం అమ్మకం**

ధాన్యం కావలసినంత పండించుకుని, అమ్మకోడానికి కూడా బోలెడంత మిగుల్చుకోగలిగే జిల్లాల్లో, పండించుకుతినే వాళ్లూ, ఒక్కసారే సాలుకి సరిపోయే సరుకు కొని దాచుకోగలిగేవాళ్లు మినహా, మిగతాజనానికి సవ్యంగా బియ్యం సప్లై చెయ్యడానికిగాను కొందరు మిల్లుయజమానులు చెప్పిన ఉపాయాన్ని పట్టుకుని, మిల్లర్లు, బియ్యం అమ్మకపుదార్లు ఏకమై రైస్ పూల్స్ ఏర్పాటుచేసుకున్నారు. పూల్స్ అంటే నలుగురూ ఏకమై, కలబోసుకుని, నిర్వహించి, పంచుకునేపద్ధతి అని అర్థం చెప్పకోవచ్చును. ఎవళ్ళమట్టుకు వాళ్ళు నిర్వహిస్తే సరిగా తుదివరకూ కొనసాగదనే భయంతో ఏర్పాటుచేసుకున్నారీ పద్ధతిని కొన్ని పట్టణాల్లో. సమయం వచ్చేసరికి ఇవి బియ్యపు పూల్స్ కావు కాని లాభాల పూల్స్ అని తేలుతోంది.

ఇంతవరకూ ప్రభుత్వము, ప్రజలూ కూడా బియ్యంపంపకంలోనే కాదు, సేకరణలోనేకాదు, రవానా నిర్బంధశాసనాన్ని అమలు జరపడంలోనేకాగు మిల్లర్లని నమ్ముకుని చెడ్డారేకాని గట్టెక్కిన పాపాన పోలేదు. అంటే ఇది మిల్లర్లు అందరిపైనా దోషారోపణ కాదు. కాని ఇంతవరకూ వచ్చిన భంగపాట్లకి వీరిలో కొందరు, కమీషన్ ఏజంట్లలో కొందరు, ఆ వీరిలో కొందరిపైన ఆశలు పెట్టుకున్న ప్రభుత్వోద్యోగులు, కారకులని ప్రజలకు తెలుసును. ధాన్యసేకరణ బాధ్యతని పూర్తిగా మిల్లర్లపైన పెట్టగానే, అంతా అనుకున్నారు, కరువులేనిచోట కూడా కరువు తెప్పించగల ముప్పున్నదని. ఇప్పుడంత పనీ జరిగింది. మిల్లర్ల చేతికి ధాన్యసేకరణ ఇవ్వబడగానే ధాన్యసేకరణోద్యోగులు వీళ్ల చేతుల్లో చిక్కారు.

ధాన్యం వందలూ, వేలూ టన్నులు సేకరించబడుతూనే ఉన్నాయి. రవానా నిషేధం అమల్లోనే ఉంది. కాని బళ్ళలో పడవల్లో బస్తాలు తాలూకాలూ, జిల్లాలూ దాటి వెళ్లిపోతూనే ఉన్నాయి. కరువులేని చోట కరువు వొచ్చేసింది.

గత ఒకమాసంగా కృష్ణా, ఉభయ గోదావరిజిల్లాల్లో ధాన్య వ్యాపారానికి ఎన్నడూ లేని గిరాకీ తగిలింది. ధాన్యం బస్తా ఇరవై, పాతిక రూపాయలకూడా కొనుక్కుపోతున్నారు.

పూల్స్ పేరుపెట్టి, కమిషన్ వ్యాపారపు లాభం, టోకువ్యాపారపు లాభం కూడా తామే గుంజుకోవాలని ఏర్పాటుచేసిన పూల్స్, లాభాల్ని తెచ్చి పెట్టాయి; ధాన్యానికి గిరాకీ తెచ్చిపెట్టాయి.

[సీతారామ్]

---

# నేటిప్రపంచం

**ఆసియా జాతీయ ఉద్యమాలు**

పసిఫిక్ ప్రాంతదేశ వ్యవహార పరిశీలక సంస్థ లక్నోలో సమావేశమై ఆసియాలో కమ్యూనిజం మొదలైన సమస్యల్ని గురించిచర్చిస్తున్నది. సమావేశప్రారంభోపన్యాసంలో భారతప్రధాని పండిట్ నెహ్రూ ఆసియాలో జాతీయోద్యమాలనుగురించి ఉపన్యసించారు. ప్రపంచం సరిగ్గా ఆసియా సమస్యల్ని అవగాహన చేసుకోలేకపోతున్నదని పండిట్ నెహ్రూ అన్నారు. ముఖ్యంగా యూరోపియన్లు అర్థంచేసుకోలేక పోతున్నారు. ఆసియాలోని జాతీయ భావప్రాబల్యాన్ని మన్నించడంలేదని కూడా అన్నారు. ఇంతే కాదు. యూరోపియన్లని ఆసియావాసులు కూడా సరిగా అర్థం చేసుకోలేదన్నారు.

పరస్పరం అర్థంచేసుకోలేని మాట నిజమే. కాని ఎందుకు అర్థంచేసుకోలేకపోతున్నారో అందరికీ తెలుసును. అందువల్లనే పరస్పరం కొంత అర్థంచేసుకునీ కొంత అర్థంచేసుకోలేకుండా ఉన్నారని అంటే పరిస్థితికి అతుకుతుంది.

ఆసియాలో రాజకీయాలు ఎలా ఉండాలీ అనే విషయంపైన యూరోపియన్ల, అమెరికన్ల దృష్టి వేరు. ఆసియావాసుల దృష్టి వేరు.

మన పల్లెటూళ్లున్నాయి. అవి దగ్గర బస్తీలకి పాలు బియ్యం కూరలు వగైరా సప్లై చేస్తూవుంటాయి. బస్తీలు పల్లెటూళ్లకి షేవ్ పౌడర్లు, రేజర్ బ్లేడ్లూ సప్లై చేస్తాయి. అలాగే నిత్యం పత్తి, రబ్బరు, తగరం, మాంగనీస్, నారసంములు మొదలైనవి ఆసియా దేశాలు యూరప్‌కి సప్లై చెయ్యాలి. యూరప్‌నించి పాలపిండి డబ్బాలు, సూదిమందులు, మరలూ మొదలైనవి ఆసియా వాసులు కొనుక్కుంటూ ఉండాలి. మళ్లీ ఆసియాలో రబ్బరు తగరం మొదలైనవి తయారుచేసి అమ్మినందుకు లాభాలు యూరోపియన్ పెట్టుబడిదారులకే పుట్టాలి.

ఆసియావాసులు కోరే దేమిటంటే వాళ్లుకూడా మోటార్లు, మందులు ఇనపసరకులు మొదలైనవి తయారుచేసి ఇతరదేశాల కమ్మి లాభాలు సంపాదించాలని. అందుకే ప్రభుత్వాలు పారిశ్రామికాభివృద్ధికార్యక్రమాలకి ముందూ వెనకా చూసుకోకుండా ఉరుకుతున్నాయి.

ఇంకెల్లా అర్థమౌతారు ఒకళ్లకొకళ్లు? "మా దేశంలో తయారైన వస్తువుల్నే మేం వాడతాం" అని ఎవరైనా అంటే అది సంకుచిత జాతీయతత్వంకింద జమకడతారు. కాని నిజానికి ఈ తత్వం ఆసియావాసుల్లోకంటె యూరప్‌లోనూ అమెరికాలోనూ అధికం. మన పరిశ్రమల అభివృద్ధిపట్లనూ కొన్ని వ్యాపారపు కంట్రాక్టుల్లోనూ ఇది స్పష్టపడుతూనే ఉంటుంది.

ఆసియావలసదేశాల్లో జాతీయోద్యమాల్ని కమ్యూనిస్టు ఉద్యమాలని పేరెట్టి అణిచెయ్యడానికి బ్రిటన్, ఫ్రాన్సు, హాలండ్ ప్రభుత్వాలు ప్రయత్నం చేస్తున్నాయి. కమ్యూనిస్టులు అనగానే వాళ్లు దేశద్రోహులు అనెయ్యడం యూరప్‌లోనూ అమెరికాలోనూ మామూలయింది. అలా అన్నా స్వేచ్ఛావ్యాపారానికీ, స్వైర వ్యవహారాలకీ అలవాటుపడిన ఆ ప్రజలు నమ్ముతున్నారు కూడా. కాని ఆసియాలో అలా కాదు. కమ్యూనిస్టులు దేశద్రోహులని జాతీయనాయకులన్నప్పటికీ, చీనా దక్షిణ కొరియాలలో వ్యవహారాల్ని చూసిన ఇతర దేశాల ప్రజలు పూర్తిగా నమ్మలేకుండా ఉన్నారు. వలసదేశాల్లో 'జాతీయ వాదుల్ని కమ్యూనిస్టులని యూరోపియన్ రాజకీయవేత్తలు నిందిస్తున్నమూలంగా కమ్యూనిజం అదేమంత మహాపాపం కాదనే దృష్టి ఆవలసదేశాల ప్రజలకు కలుగుతోంది. జాతీయోద్యమాల్ని అణచడానికి ప్రేయల్నించి ఆసియాదేశాల్ని యూరోపియన్లే కమ్యూనిస్టులచేతి కొప్పగిస్తున్నారని కూడా చెప్పవచ్చును. ఈ విషయాన్ని మాత్రం ఎంత విడమర్చి చెప్పినా యూరోపియన్లు అమెరికన్లు ఇప్పుడు గ్రహించలేని స్థితిలో ఉన్నారు. కాబట్టి ప్రభుత్వాధికారంతో సంపర్కంలేని పసిఫిక్ ప్రాంతదేశవ్యవహారసంస్థలో పండిట్ నెహ్రూ, ఆసియా జాతీయనాయకుల మనోగతి ఫలాని రీతిగా ఉంటుందని నిరూపించడానికి అన్నట్లు, ఆలోచించుకుంటూ దీర్ఘఉపన్యాసం ఇచ్చారు.

* * * *

**కొరియాలో ఇండియా ఓటమి**

కొరియాయుద్ధాన్ని ఇంతటితో ముగింపజేసి ఇతర ప్రాంతాలకు వ్యాపించకుండా కాపాడాలని భారతదేశం చేసిన యత్నం విఫలమయింది. ఒక విధంగా భారతప్రభుత్వపు అంతర్జాతీయ వ్యవహార విధానానికి కొరియాలో ఓటమి సంభవించిందనే చెప్పాలి. అటు పాశ్చాత్యరాజ్యాలకు గాని ఇటు కమ్యూనిస్టు రాజ్యాలకు గాని దాసోహ మనకుండా ఆసియాలో జాతీయోద్యమాల్ని కాపాడగలగడం అసంభవమని తేలిపోతున్నది. ప్రపంచరాజ్యకూటాల వైరాలమధ్య పడి బలికాకుండా ఏ దేశాన్నీ కాపాడ్డం అసాధ్యమని నానాటికీ స్పష్టమౌతున్నది.

అమెరికన్ సేనలు సరిహద్దు దాటి ఉత్తరకొరియా ప్రవేశించరాదని పండిట్ నెహ్రూ భారతప్రభుత్వాభిప్రాయాన్ని ప్రకటించాడు. కాని సేనలు దండయాత్రకు సిద్ధపరచబడ్డాయి. యుద్ధాలవల్ల ఏసమస్యలూ పరిష్కరించబడవని పండిట్ నెహ్రూ అన్నారు. యుద్ధం ఏ లక్ష్యంతో ప్రారంభించబడిందో ఆ లక్ష్యాన్ని సాధించడానికి శత్రువునిపూర్తిగా ఓడించడం అనవసరం. సైనికవిజయం ప్రధానలక్ష్యంగా పెట్టుకుంటే, శత్రువుల పరాజయభావం అసలుసమస్య పరిష్కారానికి ఆటంకంగా పరిణమిస్తుందనే విషయం చరిత్రానుభవమే. కాని పాశ్చాత్యుల భావనాగతిలో ఇటువంటిది అసంభవం.

ఆంగ్లో అమెరికన్ వర్గానికి ఐక్యరాజ్యసమితిలోగల ప్రాబల్యం తిరుగులేనిది. అదే వారి కన్నులు కమ్మి వారిని ప్రపంచయుద్ధానికి నడుపుకుపోతున్నది.

ఉత్తరకొరియాపై దండయాత్ర జరిగితే చీనాకమ్యూనిస్టులు చేతులు ముడుచుకు కూర్చుంటారని ఎవరూ భావించలేరు. ప్రత్యక్షంగా కాకపోతే గుప్తంగానైనా చీనాకమ్యూనిస్టులుకొరియాకమ్యూనిస్టులకు సహాయం చెయ్యకమానరు. ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనడంకూడా సంభవమేనని పెకింగ్‌లోని భారతరాయబారి అభిప్రాయపడుతున్నాడు. సమితిలో బ్రిటన్ మొదలైన 8 దేశాలు ప్రవేశపెట్టినతీర్మానం ఆమోదించబడింది. దీనితో జనరల్ మెకార్థర్‌కు దండయాత్రకు అనుమతి లభించినట్లే.

ఉత్తరకొరియా పర్వతమయప్రదేశం. గొరిల్లాయుద్ధానికి అనువైన దేశం. కొరియాలో తీవ్రంగా దీర్ఘసమరం జరగవచ్చును. మూడు మాసాల్లో తేలిపోవలసిన సమస్యను దీర్ఘపోరాటంగా మార్చుతున్నారు అమెరికన్లు. దీనివల్ల ఆసియాలో జాతీయోద్యమకారులశత్రుత్వాన్ని మాత్రమే అమెరికన్లు సంపాదించగలుగుతున్నారు. [సూర్యనారాయణ]



'క్షాను'

చౌను తిరగ్గానే పెద్ద మేడముందు గు నారికా ఆగింది నేను దిగి దిగడంతోనే మేడమెట్లు ఎక్కుతూ పైకి వెళ్ళాను నన్ను చూడగానే అక్కడున్న యువతులంతా ముట్టడి చేశారు

ఇంత సూటిగా వున్న మాట చెప్పడం మీరు ఆశ్చర్యపడవచ్చు, అసహ్యించుకోవచ్చు కూడ కాని నావికా జీవితానికి అంకితమై పోయిన నాకు అంతకంటె గత్యంతరం లేదు వేడిరక్తం ప్రవహించే యీ శరీరంలో వుబికే కోర్కెల్ని ఎంత అణచుకున్నా ఓపె హార్బర్ చేరుకుందంటే తిరుగుబాటు చేస్తాయి ముప్పై సంవత్సరాలు మీదపడ్డా ఒక పెళ్ళి, పెటాకులు లేని యీ జీవితానికి మనిషిలా జీవించడానికి యింతకంటె మరో దారి మాత్రం ఏముంది?

ఈ నావికాజీవితంలో అప్పుడే పది సంవత్సరాలు గడచిపోయాయి. ఈ పది

సంవత్సరాల్లో ఒక్కొక్క మెట్టు ఎక్కుతుంటూ అప్పటికి ఆఫీసరు కాగలిగాను. డబ్బు పుష్కలంగా వస్తుంది. అయినా వంటరివాణ్ని. రెండు మూడు సంవత్సరాల కోసారి సెలవుపెట్టి యింటికి వస్తే ఒక యింటివాణ్ణి కమ్మని ఒక పట్టాన నన్ను వదిలేవారు కారు. కాని పెళ్ళి చేసుకుని ఏం చేయను? ఈ సంకెళ్లు తగిలించుకుని దేశసంచారాలు చేయనా? స్వేచ్ఛలో నిర్విచారంగా వెళ్లమారిపోయే నా జీవితానికి యీ అనర్థకాన్ని కొనితెచ్చి పెట్టుకోడం నాకు నచ్చలేదు. ఒక స్త్రీ జీవితాన్ని ఉసురుపెట్టడం నాకు మనసొప్పేది కాదు. అందుకే యీ నావికాజీవితం నన్ను దేశదిమ్మరిగా చేసింది. ఈ జీవితంలోవున్న ఆనందాన్ని, స్వాతంత్ర్యాన్ని చేతులార నాశనంచేసుకోడానికి నా కిష్టం లేదు.

యువతులంతా నా చుట్టూ చేరారు. నావికులవద్ద పైగా ఒక ఆఫీసరువద్ద ఏవిధంగా వ్యవహరించవలసిందీ వాళ్ళకు బాగా తెలుసు. స్త్రీలోభాలకు కరువైపోయి జేబులనిండా కరెన్సీనోట్లతో ఆకలి తీర్చుకోడానికి వచ్చే నాబోటి వ్యక్తులను ఏవిధంగా మర్యాదలతో ఆహ్వానించవలసింది వాళ్ళకు క్రొత్త కాదు.

నా చుట్టూ చేరిన యువతుల్ని పరామర్శించడంలో నా చూపు రెండో గదిలో ఓ మూలగా కూర్చున్న ఒక యువతిమీద పడింది. నల్లటి ఆకాశంలో నక్షత్రాలన్నిటికి దూరంగా ధృవతారలా మెరిసిపోతున్న ఆమె ఆకర్షణ నన్ను వశం చేసుకుంది. నా అనుభవంలో అంతవరకు తటస్థపడని ఆ సౌందర్యం నన్ను చకితుణ్ణి చేసింది.

నన్నాకర్షించడానికి ప్రయత్నం చేసే ఆ యువతుల్ని తొలగించుకుంటూ రెండో గదిలో కూర్చున్న ఆమెవైపు అడుగులు వేశాను. అందరూ హేళనగా నవ్వారు. ఒకఅమ్మాయి వ్యంగ్యంగా అంది "రాతి విగ్రహానికి పూజ చేస్తారులాగుంది. కాని వరప్రసాదం సంగతో?" అందరూ మరో సారి విరగబడి నవ్వారు.

నేను ఆగి వెనక్కి తిరిగాను. "వరప్రసాదమా? దేవుడే దిగివస్తాడు" అంటూ తిరిగి ఆమె వైపు సాగాను.

ఆమె ఓ మూలగా బల్లమీద కూర్చునుంది. ఆముఖంమీద విషాదరేఖలు స్ఫుటంగా కనిపిస్తున్నాయి. తెల్లటి ఖద్దరు చీర ధరించింది. రెండు చేతులకు రెండేసి సన్నటి బంగారు గాజులున్నాయి. మెడలో సన్నటి బంగారుగొలుసు వ్రేలాడుతుంది. గదిలో వంద కాండిల్ బల్బు వెలుగుతుంది. ఆ కాంతిలో ఆ చేతిమీద పచ్చ పొడిపించిన కమల-సుధాకర్ రెండు పేర్లు స్పష్టంగా కనిపించాయి.

కమల బహుశా ఆమె పేరయి వుండొచ్చు. కాని సుధాకర్? ఆ పేరుతో నాకేదో సంబంధమున్నట్లు నేను వులికిపడ్డాను.

సుధాకర్ నా చిన్ననాటి చెలికాడు. ఇద్దరం ఒకే స్కూల్లో చదువుకున్నాం. ఒకే తాలింఖానాలో కసరత్ చేశాం. తరచుగా కుస్తీలు కూడా పట్టేవాళ్ళం. కాని పెద్దవాడయింతరువాత పెళ్లిసమస్యమీద తలిదండ్రులతో తగువులాట పెట్టుకుని మా నావికాజీవితానికి వచ్చేశాడు. నాతో పాటు కొంతకాల ముండి మరో ఓడకు బదిలీ అయిపోయాడు. అతని ఓడ తరుచుగా మద్రాసు వస్తూ వుండేది.

కాని సుధాకర్ యీ ప్రపంచాన్ని వదిలేసిన సంగతి కూడా నాకు తెలుసు. అంతా సంవత్సరం ఆరుమాసాల సంగతి. అతని ఓడ బొంబాయిరేవులో ఆగింది. ఆ ఓడ నానుకునే మందుసామాను మోసుకుపోతున్న మరో ఓడ వుంది. దీనికి ఏవిధంగా నిప్పంటుకుందో రెండూ దగ్ధమయిపోయాయి. ఆ దుర్ఘటనకు అనేకమంది ఆహుతయిపోయారు. ఆ అభాగ్యుల్లో సుధాకర్ ఒకడు.

కాని ఆ సుందరి చేతిమీది సుధాకర్ నా స్నేహితుడో కాడో నేను నిర్ణయించలేకపోయాను, అప్పటికి నేను తీసుకున్న విస్కీ ప్రభావం చాల దిగజారిపోయింది. ప్రక్కనే వున్న సోఫామీద కూర్చుండిపోయాను.

నాదొక తరహా స్వభావం. ఆర్థిక, సాంఘిక వ్యవస్థలతో నిమిత్తం లేకుండా సమాజంలో స్త్రీజాతి కుండవలసిన గౌరవం, వ్యక్తిత్వంపై నాకు పూజ్యభావం వుంది. స్త్రీత్వంలో పవిత్రత వుందని నేను భావించేవాణ్ణి. ఇదంతా నా తత్వానికి విరుద్ధంగా కనిపించవచ్చు.

నేను పరిచయమున్నట్లు లాలనగా "కమలా" అని పిలిచాను.

ఆమె నిద్రనుంచి మేల్కొన్నట్లు వులికిపడింది. ముఖంమీద చిరునవ్వు చిందులాడింది. ఆమె తలెత్తి కళ్లు తెరిచింది.

"మీరు వచ్చారా?" అంది. ఆమె ముఖం వికసించింది. నేను జవాబివ్వలేదు.

ఇరవై సంవత్సరాల పొంగే యవ్వనంలో ఆ సౌందర్యం- మెరిసే తెల్లటి దేహం ..కాని...కాని అంధురాలు, ఆ కళ్లలో చూపు లేదు. చంద్రబింబానికి గ్రహణం పట్టింది.

తన నాజూకు హస్తాలు ఎత్తి సన్నటి వ్రేళ్లతో నా ముఖాన్ని తడిమింది. నా జుట్టు నిమిరింది. కళ్లు - కంఠం - పెదాలు, వణుకుతూ స్పర్శించింది. పెదలవరకు వచ్చిన ఆమె వ్రేళ్లు ఆగిపోయాయి. ఆమె చిరునవ్వు వెలవించింది. తన చేతుల్ని వడిలో దాచుకుంది. ఒక దీర్ఘనిశ్వాస వదల్తూ "ఎవరు బాబు మీరు? మీరు నా సుధాకర్ కారా?" అంది.

నేను మాట్లాడలేదు. ఆమె గాయాన్ని మళ్ళా రేపానేమో నని బాధపడ్డాను.

"ఇక్కడకు రావడం మీ కిది మొదటి పర్యాయమయివుండాలి. ఇక్కడ కొచ్చే వాళ్లు నాతో వెళాకోళా లాడతారు. గాయంమీద కారం చల్లడం వాళ్ల కెంతో సరదా."

ఆమె కళ్ళలో ముత్యాలు మెరుస్తున్నాయి. చీర చెంగుతో వాటిని హత్తుకుంది.

ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను. ఆమెను చూస్తుంటే నా మనసంత అదోలా అయిపోయింది. కమల తన చేతిని వెంటనే లాక్కుంది.

"నాపై మీరు చూపే సానుభూతికి నేనెంతో కృతజ్ఞురాల్ని, కాని మీ రెవరయినా నా సుధాకర్ మాత్రం కారు. నా సుధాకర్ కాలేరు" ఆమె చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

నేను లేస్తూ "కమలా - చలిగాలి ఎక్కువగా వుంది. టీ త్రాగాలనిపిస్తుంది. త్రాగడానికి మీకూ అభ్యంతరం లేదనుకుంటా" అంటూ జవాబుకు ఎదురుచూడకుండానే క్రిందికి దిగాను. ప్రక్క హోటల్లో రెండు టీ పంపమని చెప్పి పైకి వచ్చేశాను.

టీ వచ్చింది. "కమలా! నేను యిక్కడకు రావడం నిజంగా యిదే తొలిసారి. కాని యిక్కడకు రాగానే ఎందుకో నా కాళ్ళకు సంకెళ్లు పడిపోయాయి. నామీద అనుమానపడొద్దు"

కమల శుష్కించిన నవ్వు నవ్వింది. "మీరు పరాయివాళ్లు. నేను బజారులో కూర్చున్నదాన్ని. అయినా మీరు చూపే సభ్యతను ఆజన్మాంతం కృతజ్ఞత తెల్పుకుంటాను. కాని మీకు ఏ సేవ చేయడానికి తగినదాన్ని కాకపోయాను"

ఆమె అభిమానానికి నాకు నవ్వొచ్చింది. "అటువంటి మాటల అవసరం మీరు మరిచిపోతే సంతోషిస్తాను. ఒక్క విషయం - సుధాకర్ కూ మీకూ ఉన్న సంబంధం ఏమిటో తెల్సుకోవాలని వుంది"

ఆమె వణుకుతున్నట్టు కనిపించింది. నేను లేచి ఆమెమీద రగ్గు కప్పాను.

"నా కేమీ చల్లేదండి. మీ ప్రవర్తన సుధాకర్ని జ్ఞాపకం చేస్తోంది. నా శరీరం

ఎట్లాగో అయిపోతుంది. రెండు సంవత్సరాలక్రితం యిదేరోజున ఆయన ప్రవర్తన కూడ యిలాగే వుంది. ఇవ్వాళ ఎంత మంచి రోజో చూశారూ? అవును ఇదేరోజు— యీ గదిలో నే—యిదేవేళ మొట్టమొదటిసారి పరిచయ మయింది."

మాట కద్దువస్తూ "అప్పుడు మీ కళ్లు బాగుండేవా?" నే నడిగాను.

"అప్పుడు నా కళ్లెంతో ఆరోగ్యంగా వుండేవి. అందరూ అనేవారు కూడా నా కళ్లు అందంగా వుండేవని. నా శరీరాన్ని కూడా చూశారుగా? రెండు సంవత్సరాలక్రితం నా సౌందర్యంమీద ఎంతో గర్వపడేదాన్ని. కాని ఆ సౌందర్యానికి బదులు యీ కళ్లే మిగలివుంటే "

"మీరు సుధాకర్ సంగతి మాట్లాడుతున్నారు కదూ?"

అవును ఆ రాత్రికూడ యిదేవేళనుకుంటాను. ఆయన తూలుకుంటూ పైకి వచ్చారు. తిన్నగా మీరు కూర్చున్న యీ సోఫామీద వచ్చిపడ్డారు. ఆఅందంలో ఎంత అమాయకత్వం వుందని, ఆసాయంత్రం బాగా త్రాగారేమొ ఆయన కేమాత్రం మతి లేదు."

సుధాకర్ నడతమీద నే నెంతో గర్వపడేవాణ్ణి కాని ఓడజీవితం నాలాగే అతన్ని కూడ అడ్డమాలిన ప్రదేశాలకు అలవాటు చేసింది? ఏమో నేను విశ్వసించలేకపోయాను అయితే యీ సుధాకర్ మరొకడ యుండాలన్న ఆలోచన కల్గింది.

"నేనీ యింట్లోకి రావడం అదే క్రొత్త. త్రాగివున్నాడని తెలుసుకుని నేను వారిపోయి దూరంగా నిల్చున్నా. అంతలో ఆయన "చూడండి— నాకు చాల దాహంగా వుంది. కాస్త నీళ్లివ్వండి" అన్నారు. ఆ స్వరంలో ఎంతో నమ్రత, నమ్మకం కనిపించింది. భయపడుతూనే మంచినీళ్ళ గ్లాసు ఆయన కిచ్చాను. నీళ్లు త్రాగి సోఫామీదనే పడుకున్నారు.

"అర్ధరాత్రిగ్గాని ఆయనకు స్పృహ రాలేదు. మిగతా పిల్లలసాయంతో సోఫామీదనుంచి మంచంమీద పడుకోపెట్టాను. నా భయంమాత్రం పోలేదు. నే నట్లాగే సోఫామీద కూర్చున్నా. ఇంతలో కళ్ళు తెరిచి కంగారుపడుతూ లేచి కూర్చున్నారు. నన్ను చూసి ఆశ్చర్యపడ్డట్లు కనిపించారు. గదంతా కలియజూసి తానెక్కడున్నానని నన్నడిగారు. నేను జరిగినదంతా చెప్పాను. ఆయన లేచి 'క్షమించండి. మిమ్మల్ని చాలా కష్టపెట్టాను. నా స్నేహితులు బ్రాంది త్రాగించి నాతో పరాచకాలాడారు' అంటూ జేబులోంచి రెండు పదిరూపాయల నోట్లు తీసి సోఫాలో పెట్టూ 'నేను వెళ్తున్నాను. క్షమించండి' అన్నారు.

"నా హృదయం చాలా బాధపడింది. పురుషుని అమాయకత్వాన్ని అనువుగా చేసుకుని దోచుకునె నేర్పు నా కింకా అలవడలేదు. ఈ జీవితానికి రాకముందు ఒక గౌరవ కుటుంబంలోని దాన్నే. అందుకే నాలో యింకా సభ్యత పూర్తిగా నశించలేదు. చలిగాలి తీవ్రంగావుంది. ఆయన వంటిమీద కోటుకూడా లేదు. ఆసమయంలో ఆయన వెళ్లటం నా కిష్టంలేదు. ఆ రెండు నోట్లు ఎత్తి ఆయనకు తిరిగి యిచ్చేశాను. ఆయన కూర్చునివుంటే ఆయనట్లాగే చూస్తూ వుండిపోదా మనిపించింది— నిద్రపోతున్నారా?"

"లేదు - లేదు - చెప్పకురండి"

"వారు చాలా ఖులాసామనిషి. వార్ని ఆపుచేయడానికి అనేక ప్రయత్నాలు చేసినమీద ఆయన 'సరే - వెళ్ళను. నా జీవితంలో ప్రథమంగా యిటువంటి ప్రదేశానికి వచ్చాను. తీరా వచ్చింతరువాత యీ యింటినుంచి అంధకారంలో పోవడమూ, పట్టపగల్లో పోవడమూ రెండూ ఒకటే అనా[illegible]. ఈ నిర్ణయంమీద నా కెంతో సంతోషం కలిగింది. ఇంతలో వారన్నారు మళ్ళా 'చూడండి! నా కా సోఫా యివ్వండి. మీరి మంచంమీద పడుకోండి' అని.

"కాని నా కారాత్రి నిద్రపట్టలేదు. కళ్లు మూతబడగానే అంధకార మావహిస్తుందన్న భయం నాలో కలిగింది. నాకు నిద్రపట్టకపోవడం ఆయన కనిపెట్టారు సిగరెట్టు కాలుస్తూ అన్నారు "మీకు నిద్రపట్టడం లేదనుకుంటా. పోనీ కూర్చోండి. ఏమన్నా కబుర్లు చెప్పకుందాం"

"అయితే దారిలో పడ్డాడన్నమాట" నానోటంట చటుక్కున వచ్చేసింది.

"లేదు. మీరు అపార్థంచేసుకోవద్దు. వారు సిగరెట్టు పొగవదల్తూ 'మీ గురించి ఏమీ చెప్పరా' అంటూ అడగ్గానే ఏవిధంగా ఆరుమాసాలక్రితం నా భర్తను, యింటిని వదలి పారిపోయి వచ్చేసినసంగతి— ఆతర్వాత నాకు తటస్థపడ్డ వివరాలు ఒక్కటీ దాచకుండా— ఎట్లా చెప్పానో నాకే అర్థం కాలేదు. ఆయన మౌనంగా వింటూ కూర్చున్నారు. వారు మొదటిసారి కళ్లెత్తి నా కళ్లల్లోకి చూశారు. ఆ ఒక్క క్షణంలో నా జీవితానికంతా ఒక గాథగా అనిపించారు. వెంటనే తలదించుకుని 'ఈ జీవితం మీకు చాలా యిష్టంగా వుందనుకుంటా' అన్నారు.

"ఆమాటలోని బాధ, సానుభూతి నాకర్థంగాకపోలేదు. బహుశా నా పడిపోయిన జీవితంమీద విచారపడుతున్నట్లనిపించింది. నా హృదయం వుబికిపోయింది. నేను మంచంమీదనుంచి దిగి గది కిటికీనుంచి క్రింద బజాలోని అంధకారంలోనాకు నేను మరచిపోడానికి ప్రయత్నించాను.

"నామాటలవల్ల మీకు కష్టం కలిగిందేమో! నా వుద్దేశమది కాదు" అకస్మాత్తుగా మళ్లా అన్నారు.

"కిటికీనుంచి చూస్తున్న నా ముఖాన్ని తిప్పకుండానే అన్నాను. 'నిజమే, మనిషయింతరువాత తప్పులు జరుగుతుంటాయి. కాని స్త్రీ, పురుషులు చేసే తప్పులు విచారించడంలో సమాజం యొక్క న్యాయం భేదిస్తుంది. స్త్రీ తప్పుగాని చేస్తే సమాజాన్ని క్షమాపణ కోరుకోడానికి అనర్హురాలు. ఆమెగురించి మిగిలింది పతితగా వెళ్ళి మారిపోవడమో, లేక మృత్యువుని కోరుకోవడమో. వేశ్యల కొంపల్లోకి ప్రపంచమంతా మోకరిల్లుతుంది. అనుభవించేముందు ఎన్నో వుపదేశాలిస్తుంది. కాని చేరదీసేవాళ్లుమాత్రం ఒక్కరూ కనిపించరు'

"సోఫానుంచి లేచి నా వెనగ్గా నిలబడ్డారు. సిగరెట్టును బూటుతో నలిపి నా భుజాలమీద చేతులు వేసి వారివైపు తిప్పుకున్నారు. కొన్ని క్షణాలవరకు నా ముఖంలో తీక్షణంగా చూస్తూ అన్నారు. 'కమలా పవిత్రమైన మనసుతో పతికినట్లయితే భగవంతుడు కూడ ల[illegible]స్తాడు. ఈ జీవితాన్ని వదిలిపెట్టారా నేను ఆశ్రయమిస్తాను?'

"నా కంతా కలలా వుంది. వారట్లాగే నా కళ్లల్లోకి గుచ్చిగుచ్చి చూస్తుంటే వారిని చూడలేకపోయాను. ఆ ముఖం గంభీరంగా వుంది. ఏదో భీష్మప్రతిజ్ఞ చేస్తున్నట్లు వారి అధరం కఠినంగా కంపించింది. నాలో నిలబడే శక్తి లేకపోయింది. వారి కాళ్లవద్ద అట్లాగే కూర్చుండిపోయాను. నా కన్నీళ్లు ఎంత నిరోధించినా ఆగలేదు. వారు గంభీరంగా అట్లాగే నిలబడివున్నారు.

'చాల కఠినమైన కార్యం. విశ్వాసంతో ప్రయత్నించండి. బహుశా జీవితంలో జయంపొందగలగొచ్చు. ఈ పర్యవసానంచూడ్డానికి మళ్లా వస్తాను.' దీనితరువాత వారు ఒక్కక్షణంకూడా ఆగలేదు. కనీసం తిరిక్కూడా చూడలేదు. మరుసటిరోజునుండే నాకు జ్వర మ్మొదలయింది. ఆ జ్వరంనుంచి యీరోజువరకూ నాకు విముక్తి లేదు.'

"అత నెవరో తెలుసా మీకు?" నే నడిగాను

"వారు నావికాదళంలో ఒక ఆఫీసరని

మాత్రం తెలుసు. అదీ వారిటోకీ, అదీ చూస్తే అట్లా అనిపించింది' ఆమె మౌనంగా కూర్చుంది.

అయితే అతడు సుధాకర్ అని నేను దృఢపరచుకున్నా, కాలేజీ ప్లాట్‌ఫారంమీద సమాజంయొక్క దురాచారాలు ఏకరువు పెట్టేవాడు. సమాజంలో ప్రత్యేకంగా స్త్రీ జాతి పొందే అక్రమాల్ని నిరసిస్తూ వారిని వుద్ధరించే సందేశాలు యివ్వడంలో ఉద్వేగం కనబరిచేవాడు. సంఘంలో స్త్రీకి సమానత్వ ముండాలని అతని విశ్వాసం. నవ్వులాటలో ఒక రోజు "మాటల వుద్రేకానికి, చేతల సాహసానికి చాలా తేడా వుంటుందోయ్" అన్నాను. దీని కతడు వెంటనే సమాధానంకూడా యిచ్చాడు." అటువంటి సమయ మొచ్చి నప్పుడు వీడు కేవలం మాటలమీద బ్రతికే వాడు కాడని నీకే తెలుస్తుంది."

కాని యీ సంఘటన చూస్తే అతన్ని పరీక్షించడానికి విధాతే అతన్ని ఇక్కడకు పంపేడేమో ననిపిస్తుంది. కాని యీ పందెంలో గెలుపు పొందకముందే అతను".. ...

"మీ రేదో ఆలోచిస్తున్నారులా గుంది- ఆమె నా ఆలోచన్ని అరికట్టింది. "వారు కూడ మిగతావాళ్లలాగే వచ్చి మజా చేసి వెళ్లిపోయా రని అనుకుని వుంటారు. కాని అట్లా కాదు. వారు మళ్లా వచ్చారు."

మళ్లా వచ్చారా ?" నా కాశ్చర్యం కలిగింది.

"అవును. వచ్చారు. నెల పదిహేను రోజుల తరువాత అంధకారంలో గాకుండా పట్టపగలే వచ్చారు. ఆ రోజే హార్బరులోకి ఓడ వచ్చింది. జ్వరంతో నేను మంచంమీద పడివున్నా, లేచి కూర్చోలేకపోయాను. నా మంచంమీద కూర్చుని లాలనగా అన్నారు. 'ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నట్లు న్నావ్. బంగారం కాలితేనే గాని మేలిమి కాదు. అసలీపరిస్థితి ఎందుకు తెచ్చిపెట్టుకున్నట్లు ?'

"ఆరోజే నన్ను ఆస్పత్రిలో జేర్పించారు. వారి ఓడ యీ హార్బరులో వున్న ఆరురోజులు రాత్రీ, పగలు అనకుండా నా ప్రక్కనే వున్నారు. 'కమలా యివ్వాళే ఓడ కలకత్తా బయల్దేరుతుంది. ఒక్క మాసంలో తిరిగి వస్తాను. ఇంతలో నీవూ బాగుపడతావు. అయినా ఇక్కడే వుండు. నీ ఖర్చునిమిత్తం అన్ని ఏర్పాట్లు చేశాను. తిరిగి రాగానే ఒక్క మాసంపాటు సెలవు తీసుకుని నిన్ను అమ్మదగ్గరకు తీసుకుని వెళ్తాను' అంటూ వందరూపాయల నోట్లు అయిదు నా తలగడక్రింద పెట్టారు. మొదటి సారి ఆప్యాయంగా నా చెదిరిన జుట్టును నిమురుతూ ముద్దుపెట్టుకున్నారు. ఆ నోట్లు యింకా అట్లాగే నా పెట్టెలో పడివున్నాయి. వారు నాకు దక్కనప్పుడు వాటిని ఖర్చుపెట్టిమాత్రం ఏం చేయను చెప్పండి ?"

"ఆ తరువాత ?"

"ఆ తరువాత-వా రింతవరకు తిరిగి రాలేదు." ఆమె కళ్లంట నీళ్లు తిరిగాయి.

"ఆస్పత్రిలో నయమయినతరువాత యిక్కడి కొచ్చావన్నమాట"

"ఈ కొంపలో చూచింతరువాత మీ మాటలో కాఠిన్యత కనిపించడంలో ఆశ్చర్యం లేదు. కళ్లు పోగొట్టుకున్నా, యీ కొంపలోని స్త్రీలతోపాటు నన్ను చులకన చేస్తున్నారు. ఇదంతా నా దురదృష్టం. నా సర్వస్వాన్ని ధారపోసినా ఆయన్ని పొందలేకపోయాను. ఆయన వెళ్లిపోయినతరువాత నా జీవితం మారిపోయింది. నా గది తలుపులు ప్రపంచానికి మూత బడిపోయాయి. భుక్తికోసరం పాచిపనులు చేశాను. వంటమనిషి నయ్యాను. పస్తులున్నాను. కాని ఆయన తిరిగి రాలేదు. ఆరుమాసాలు గడిచిపోయినా వారిజాడ లేదు. నా ధైర్యం కూలిపోయింది. ఎన్నో సందేహాలు నాలో సంఘర్షణ చేశాయి. జ్యోతిష్కుల్ని వేడుకున్నాను. దేవాలయాల్లో మొక్కుకున్నాను. కాని ఫలితం దక్కలేదు. నా ఆరోగ్యం చెడిపోయింది. జ్వరం ఓవైపు నన్ను వెంటాడింది. ఏడ్చి ఏడ్చి యీ కళ్లు చూపు పోగొట్టుకున్నాయి. బాగు చేయించుకోడానికి యీ రోజువరకు వారి డబ్బు ముట్టుకోవాలంటె నా మనస్సొప్పదు. ఇప్పుడు యీ యింట్లో వారి దయమీదనే ఆధారపడివున్నా. ఇప్పటి కయినా ఆయనకు దయకలిగి యిటు వస్తారేమో నని ఆయనగురించి యింకా ఎదురు చూస్తున్నా. పోనీ ఒక్కసారే కానివ్వండి. వారి క్షేమం వినేంతవరకు నా ప్రాణం పోదు."

నా కళ్లు చెమ్మగిల్లాయి. ఏమనాలో నా నోటంట మాట పెకల్లేదు.

"మీ రెవరో నాకు తెలీదు. ఇంతవరకెవరూ నన్ను చూసి నవ్వకుండా వుండలేకపోయారు. అందరూ నేను పిచ్చిదాన్ననుకుంటారు. వారి రాకకై ఎదురు చూస్తున్న నిజంగా పిచ్చిదాన్ని, గుడ్డిదాన్ని"

ఆమె చేతి వ్రేళ్లు ఆమెమెడలో వ్రేలాడుతున్న లాకెట్‌తో ఆడుకుంటున్నాయి. చివరకు ఆ లాకెట్ విప్పి నాముందు వుంచింది.

"చూడండి ఆయన్ని. నాకు దారి చూపి దారి తప్పారు"

లాకెట్‌లో వుంది సుధాకర్ ఫొటోయే. కమల అన్నట్లే యితరులకి మార్గం చూపి తన మార్గాన్ని పోగొట్టుకున్నాడు.

ఆమె కంతా వినిపించా లనిపించింది. "కమల! మీ తపస్సు విఫలమయిపోయింది. సుధాకర్ యికయీ ప్రపంచంలో లేడు" అనిమాత్రం అనగలిగాను. తరువాత అక్కడ కూర్చోలేకపోయాను. వెనక్కి తిరిగిచూడకుండానే క్రిందకు దిగివచ్చేశాను

నా కా రాత్రంతా నిద్రపట్టలేదు. కమల విషాదజీవితం నా మెదడులో సుళ్లు తిరుగుతోంది. ఉదయం కాగానే నిర్ణయించుకున్నా సెలవుపెట్టి కమలను సుధాకర్ తల్లిదగ్గర దిగపెట్టాలని. ఆ ముసలితల్లి కొడుకుదుఃఖాన్ని యీ కోడలివల్ల మరచిపోవచ్చు.

కాని నా ఆలోచనంతా వ్యర్థమైంది. ఆ రోజు వుదయమే కమల తన ప్రియుడ్ని కలుసుకుంది. ఆమె ముఖంమీద యింకా ఆ చిరునవ్వు ఆడుతూనే వుంది. ఆమె హృదయంమీద వున్న కుడిచేతి గుప్పెటలో సుధాకర్ లాకెట్టు యిమిడిపోయింది.

ఆమె అంతిమ సంస్కారాలు నా చేతులమీదనే జరిగాయి.

అంతా 15 రోజు లయింది. డ్యూటి నుంచి సెలవు తీసుకుని యింటికి వళ్లాను. వచ్చి పడివున్న వుత్తరాల కట్టలో సుధాకర్ వుత్తరం కూడా ఒక టుంది. రెండో పేజీలో వ్రాశాడు—

".. నీ కో సువార్త వినిపిస్తా. నేను పెళ్లి చేసుకోబోతున్నా. అదీ త్వరలోనే పిల్లను చూచానుకూడా పెద్దింటిపిల్ల కాదు. ధనికుల పిల్లా కాదు. దారి తప్పిన ఒక స్త్రీ. కాని ఆమె మళ్లా దారిచేరుకోడాని కష్టపడుతోంది. ఆమె కాశ్రయ మివ్వడానికి మాటకూడ యిచ్చాను. దీనివల్ల ఆమెకూ- సమాజానికి బహుశా నాకూ కూడా ఉద్ధరణ జరగవచ్చు. .. నా మాటలు జ్ఞాపక మున్నాయా ? ఆ అమ్మాయిపేరు తెలుసుకోవాలని వుందా ? చెప్పమంటావా ? అయితే విను. క-మ-ల. అందంగా లేదూ ? తీయగా లేదూ? నీవే స్వయంగా చూస్తే- నిజంగా నమ్ము, యీర్ష్యతో వుడికిపోతావ్"

మనస్సంతా మరోసారి ఏడ్చింది.

---

# పరిణామం



గోపాలానికి సర్వీసు కమీషన్ ధర్మాన ఉద్యోగానికి ఎపాయింటుమెంటు ఆర్డరు వచ్చింది. దాంతో కామమ్మ ఇహ అందలం అందుకుంది. రాముడికి కొత్త బట్టలు కుట్టించింది. సాక్షాత్తూ కొడుక్కి కలక్టరుగిరియే దొరికినంతగా సంతోషించింది.

కామమ్మకి స్వయానా చెల్లెలికొడుకు రాముడంటేను. వాడిక్కడే వుండి మెట్రిక్యులేషన్ పరీక్షకి చదువుతున్నాడు. అసలు గోపాలమూ, రాముడూ చిన్నప్పట్నించీ ఒకచోట పెరిగి, ఒక కంచంలోనే తిని. ఒక మంచంమీదే పడుకున్నవాళ్ళవడంచేత పెద్దయినా వాళ్ళు విడిపోలేకుండా వున్నారు. నిజానికి రాముడికీ ఎవరూ లేరు. తల్లి ఏనిమిదోయేటనే చచ్చిపోయింది. తండ్రి నరసయ్యపంతులున్నది కాస్తా తెగనమ్మి, చీట్లాడి, తాగి, అక్కరైన చెత్తమనుషులికీ పెట్టి ఆస్తి అంతా హాతమార్చేశాడు. నరసయ్య దగ్గరుంటే బాగుపడే యోగ్యత లేదనినీ, ఏదో చెల్లెలి కొడుకుగదా అనే అభిమానం కొద్దినీ కామమ్మ రాముణ్ణి తీసుకొచ్చి తనింట్లోనే వుంచుకుంది. తన కొడుక్కి ఎలా చేసే, వాడికీ అలాగే చేసింది. రాముణ్ణి చేరదీసినందుకు కామమ్మని బంధుకోటంతా అభినందించింది. కామమ్మ కదో గర్వకారణం.

**శ్రీ బదరీనాథ్**

రాముణ్ణి తీసుకొస్తానంటే రాఘవయ్యలో పల్లెంమాట కాదనలేకపోయాడు. న్యాయానికి రాముడి బాధ వాళ్ళకి ఏమీ లేదు. ఆ ముక్కే అప్పుడప్పుడు కామమ్మ గూడా అంటూండేది. పైగా ఆ దంపతులిద్దరికీ నచ్చింది. వాణ్ణి తమ కొడుక్కి మల్లేనే చూసుకుంటూ వచ్చారు. గోపాలం కంటె రాముడు మూడేళ్ళు చిన్న. వాళ్ళిద్దరూ స్నేహితుల్లా వుంటారుగాని పెత్తల్లి పింతల్లి బిడ్డల్లా వుండనే వుండరు. ఇద్దరికీ గూడా మహారాజు బిడ్డల్లా జరుగుతూంది.

రాఘవయ్య అయినా పెద్ద వున్నవాడేం కాదు. ఏ డెకరాల మాగాణీ, కాకినాడలో ఓ సొంతిల్లూ వుంది. కామమ్మ మంచి గడసరి గాబట్టి ఏదో కాస్త గుట్టుగా. నలుగురి నోళ్ళలోనూ పడకుండా సంసారాన్ని లాక్కొస్తోంది. అయినా రాఘవయ్య దీర్ఘరోగం మూడు సంచుల్ని మింగింది. మింగుతూకూడా దినదిన ప్రవర్ధమానమాతూంది. అయి, అయి ఒక్కనాడు అగ్నిపర్వతంలా పెటిల్లుమని పోయి రాఘవయ్యకి పరలోకప్రాప్తి కలిగింపజేసింది. నలుగురు బంధువులూ వచ్చారు. అప్పుడే శేషయ్య, లక్ష్మమ్మకూడా దిగారు. అసలు వాళ్ళు వచ్చింది వేరేపనైనా కామమ్మ కష్టం కాసుకుతెందుకు వచ్చినవాళ్ళలా నటించారు. ఓసారి తమ పాతబంధుత్వాన్ని జ్ఞాపకంచేసి అయిన సంబంధం చేసుకోవాలని శేషయ్య అసలు వుద్దేశ్యం.

ఇన్నాళ్ళుగా శేషయ్య రాకపోవటానికి కూడా కారణం వుంది. నరసయ్యపెళ్ళిలో మాటా మాటా వచ్చి రాఘవయ్య, శేషయ్య, జుట్టూ జుట్టూ పట్టుకొన్నారు. అందరూ వచ్చి ఆపుతేనేగాని యిద్దరికిద్దరూ ఆగలేదు. ఆనాడు నువ్వు ఛస్తేనేగాని రానని తనన్న మాట అక్షరాలా నిలబెట్టుకున్నాడు శేషయ్య. ఆనాటికీనాడు తను మళ్ళీ రాఘవయ్య గుమ్మంయెక్కాడు. అప్పుడు కామమ్మ యేమీ అనలేకపోయింది. అటు-శేషయ్య తనకి తక్కువ బంధువు కాదు. ఇటు రాఘవయ్య మొగుడైపోయిరి. ఎవరితో యేం చెప్పినా కస్సుమంటూ రాయెను.

అయినప్పటికీ తను రాఘవయ్యతో చెప్పి చూసింది. 'అదుగో! మీ వాళ్ళు గదా అని వెనకేసుకొస్తున్నావు' అన్నాడు అతను. శేషయ్యతో గూడా చెప్పింది "చేతనయితే ఆ మాట మీ ఆయన్తోటే చెప్పు" అన్నాడు. తప్పని సరిగా తను నోరు మూసుకోవాల్సొచ్చింది. ఈనాడు శేషయ్య తనింటికొచ్చేటప్పటికి తన గుండెల్లో తెప తెపమన్నా కామమ్మకి కొంచెంత ఆసరా కలిగినట్లయింది. "పాత ద్వేషాలన్నీ మర్చిపోయి మళ్ళీ వచ్చావు. సంతోషం, రా నాయనా," అని కామమ్మ అన్నమాటకి శేషయ్య కదిలిపోయాడు. "ఇంక మాకు మీరు, మీకు మేమూ కాక ఇంకెవరికెవరవుతాగ?" అనేటప్పటికప్పుడే అనుకున్నాడు శేషయ్య-గోపాలం

తన అల్లుడేనని అయితే అది సమయం కాదని అప్పు డామాట తలపెట్టలేదు

## 2

"అదేమిట్రా నా తండ్రీ! ఉత్తరం ముక్కైనా లేకుండా యీ రాక ఏమి ట్రోయ్! మా కోడల్నికూడా తీసుకొచ్చావే!" అంటూ సంభ్రమానందాలతో కామమ్మ శేషయ్యకీ, లక్ష్మమ్మకీ తన కాబోయే కోడలికీ కూడా స్వాగతాన్నిచ్చింది ఆగిన జట్కాలోంచి లోపలికి సామాన్లు తెస్తూ, 'అనుకోకుండా అకస్మాత్తుగా బయల్దేరాము లేకుంటే కాస్త ముక్క రాసిపారేయటాని కేం భాగ్యం?" అన్నాడు శేషయ్య ఇద్దరూ పెరట్లో కెళ్లి కాళ్ళూ చేతులూ కడుక్కున్నారు సీతమాత్రం లోపలి కెళ్లకుండా యెందుకో వసారాలోనే నుంచుంది లోపలి కెళ్ళిన కామమ్మ వసారాలో కొచ్చి సీతను చూసి మూతి తిప్పుకుంటూ 'అయ్యొ నా తల్లీ! ఇప్పుడే యింత సిగ్గయితే రేపొద్దున్న మొగుడితో యేం కాపరం వెలిగిస్తావే!" అంది సీత బుగ్గలు నొక్కి పెరట్లో వున్న లక్ష్మమ్మకి వినపడేలాగు ఒక్క కేక వేసింది "నీ కూతురు వసారాలో భీష్మించుకు నుంచుంది ఇలా వచ్చి తీసుకెళ్ళి కాళ్లు కడిగించమ్మా" సీత మరీ సిగ్గుతో తలొంచుకుంది ఈ లోపల లక్ష్మమ్మ ముఖం తుడుచుకుంటూ "అదేమిటే, సీతా! బాగుందమ్మా, ఇదేమన్నా నీకు పరాయిల్లా యేమన్నానా? మా కంటే చుట్టాలిళ్ళకి వెళ్ళటం, వుండటం నామోషీగాని—మా దేమన్నా సామాన్యబ్బంధుత్వాలనుకున్నావా? ఈ రోజుల్లో చుట్టాలని చూడ్డం, బంధుత్వాలు దగ్గరసా చేసుకోవటం మీ కేదో యిదిగాని మేమంతా ఎంత ఒద్దికగా వుండే వాళ్ళం? అయ్యొ వెఱ్ఱి నాగమ్మా, నడు నడు అన్నది దాంతో కాస్త లేచింది సీతమ్మ ఇంతలో రాముడు వచ్చాడు వసారాలో వున్న పెట్టీ, బేడా చూసి ఎవరో వచ్చార్రో అనుకొంటూ లోపలి కెళ్ళి— తీరుబడిగా కూర్చుని ప్రయాణంలో వాళ్ళెంత కష్టపడిందీ— బుకింగ్ క్లోజ్ అంటే తను స్టేషన్ మాస్టర్‌తో దెబ్బలాడి యేవిధంగా టిక్కెట్లు తెచ్చిందీ- థరుడుక్లాసులో చోటు లేకపోతే అతికష్టంగా సెకండు క్లాసులో యేవిధంగా యెక్కిందీ ఆయాసంతో చెప్తూన్న శేషయ్యమామని చూశాడు

"శేషయ్యమామ వచ్చాడే అడుగో లక్ష్మమ్మత్తగూడా వచ్చింది, ఇంకేం?" అన్నాడు రాముడు సంతోషంతో

"ఇప్పుడే వచ్చాడురా మీ మావ వి న్ని



బా[illegible] తీసుకొచ్చాడు" అని బోధించింది కా[illegible]మ్మ "ఏదీ మా వదిన?" అంటూ నాలుగు వైపులా గిరున తిరుగుతూ ఆత్రంగా చూశాడు రాముడు 'అదుగో' అని వంటింటి గుమ్మమీద ఈ మాటలు విని తల వంచుకుని కూర్చున్న సీతని చూపించాడు శేషయ్య రాముడు నవ్వుతూ ఎందుకో వసారాలోకి పారిపోయాడు

"మధ్యని నీ కెందుకురా సిగ్గు?" అన్నాడు శేషయ్య నవ్వుతూ మరో

(23-వ పేజీ చూడుడు)

**నవల :**




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౫౧

దొడ్డిలో కాకి మరల మరల అరచుచున్నది! ఈ మధ్య చెలరేగిన గాలివానతోడను, మహాయుద్ధముతోడను ఏకశిలానగరము లోని వెలిపాలెము ముఖ్యముగా ఎక్కువ దెబ్బతిన్నది బొల్లని ఇంటి కప్పుడు వేసిన ఆకు లన్నియు లేచిపోయినవి. నిరాటంక ముగా ఇప్పుడు సూర్యభగవాను డందులో నుండి ఇంటిలోనికి ఉద యమునుండి సాయంత్రమువరకు ప్రవేశించి రాకపోకలు సలుపుచున్నాడు. ఆ మధ్య కాకుల సంచారము కూడ కట్టువడి నది ఈనాడు ఆ కాకి మరల మరల తన దొడ్డిలో అరచుచుండు టచే, మంగికి నిస్పృహలో ఒక ఆశావేశము అంకురించినది.

"ఎవరు వస్తారు. కాకమ్మ ?"

ఆ మాటలు విని ఉత్సాహముతో పాటి అందుకున్నది. తెలుగుగడ్డపై తెలుగు పుట్టినప్పటినుండి ఉన్న పాట ప్రారంభించి నది :

"కాకమ్మ, కాకమ్మ, కరారు కాకమ్మ !
చుట్టా లొస్తే చూచి పో,
పక్కా లొస్తే పారీ పో,
నీ కాలికి గజ్జె కట్టిస్తా,
నీ మూతురకు వెన్న పెట్టిస్తా,
మాయయ్య వస్తే కాలెత్తి.
గంతెయ్య,—ఒక్కటే గంతూ !"

ఆ కాకియు చిత్రముగా ఒక్కటే గంతు వేసినది. పాటి ముఖము నవ్వుతో వికసించినది. మంగి తనకు కడుపులో పొంగు కొని వచ్చుచున్న దుఃఖము ఎట్లో పైకి కనబడనీయకుండ ఆపుకొ నుచు, 'మీ యయ్య వస్తాడు లేవమ్మ ?' అన్నది.

పాటిఊహాలు దూరముగా అల్లుకొనిపోయినవి
"మా యయ్య నా కేమి తెస్తా డమ్మ ?"

మంగికి కన్నులలోనుండి నీరు ఉబుకుకొని వచ్చుచున్నది. పాటికి అర్థము కాలేదు

"అయ్య వస్తంటే అట్లా ఏడుస్తా వేమే ?"

కాకిగంతుమీద పాటి కున్న నమ్మకము తల్లి కేదీ ? వాకి టిలో బరువైన అడుగుల చప్పు డైనది. "అయ్య వచ్చాడు !" అంటూ చెంగున పాటి వాకిట్లోకి పరుగెత్తినది. దాని వెంటనే మంగికూడ నెమ్మదిగా నడచినది.

వాకిటిలోనికి వెళ్లగానే పాటికి ఉత్సాహభంగ మైనది ! సంపూర్ణముగా కవచములు ఆచ్ఛాదించిన దేహములు గల ఇద్దరు యోధవీరులు దానికి కనబడినారు వా రిద్దరును ముఖపిధానము చేయు పట్టములు పై కెత్తి చిరునవ్వుతో దానివైపు చూచుచుండిరి తన తండ్రి కానందుకు బిక్కమొగము వేసికొని పాటి చప్పున ఆగి, ఎగాదిగ వారివంక చూడసాగినది దానికి ఉత్సాహ భంగమై ఏడుపు కూడ వచ్చుచున్నది ఆ వచ్చిన యోధు లిద్దరు పక్కన నవ్వి, స్వతంత్రముగా, ముందుకు వచ్చినారు అందులో ఒకడు ఆదరముతో పాటిని తన చేతులతో నెత్తికొన్నాడు పాటి వెగ టుతో ముఖ మావలకు త్రిప్పి తప్పించుకొనవలె నని ప్రయత్నించు చున్నది

ఈ మారు చిరునవ్వు నవ్వినది మంగి ! దాని కన్నీ రంతయు నది తుడుచుకొని సంతోషమే రూపొందిన దైనది

"ఏమే ? అయ్యను మామయ్యను పోల్చుకో లేదుటే ?"

"ఎవరు ?—అయ్య ?— మామయ్య ?—"

పాటి నెత్తుకొనిన వీరుడు దానిని దింపి శిరస్త్రాణము పూర్తిగా తీసివేసి పాటికి తన ముఖము చూపినాడు. అది వంటనే 'అయ్యా !' అనుచు వానిని కౌగిలించుకొనినది

మంగి లోనికి వెళ్లి ఇద్దరకు కాళ్లకు నీళ్లు తెచ్చినది

కొంచెముగా సంభాషణ జరిగినతర్వాత బొల్లనికి ముంగు ఆశ్చర్యమై భార్యను ప్రశ్నించినది ఆ యింటినిగూర్చి !

"నేను పంపిన బంగారము నీకు చేరలేదా ?—దానితో పెద్ద భవనమే నీవు కట్టించి యుండవచ్చునే !"

మంగికి ఆశ్చర్యమైనది !

"నీవు బంగారము పంపినావా ?—పాపము, మహానుభావు డైన ఒక ఫకీరు నాపై జాలి పొంది చారెడు బంగార మిచ్చినాడు తర్వాత లెక్కపెట్టగా ఏబది మాడ లున్నవి అవి జాగ్రత్తగా ఇంతవరకు వాడుకొనుచున్నాను ఇంకా ముప్పది మిగిలి ఉన్నవి!- ఇదుగో !" అని మంగి లోపలికి వెళ్లి తెచ్చి బొల్లనికి చూపినది !

అది చూచుచునే బొల్లడు మండిపోయెను. మంగి ఉలికి పడెను. పాటి ఏడుపే సాగించెను.

"వాడు మహానుభావుడా? దొంగ!—ఏబది మాడలు నీకు ముష్టి పెట్టినాడా?"

మంగికిని ఆశ్చర్యమై బొల్లనివంక చూడసాగినది.

"నేను వేయి మాడలు పంపినాను!—"

అతనితో వచ్చిన గండడు చిరునవ్వు నవ్వుచు, "పోనీ, పాపిష్టి ధనము తీరే అది!" అనుచు బొల్లని ఓదార్చెను.

"ఆ దొంగ ఇప్పు డెక్కడ ఉన్నాడు? మరల కనబడినాడా?"

మంగి మౌనము వహించెను స్వయంభూ దేవాలయసమీపమున జరిగిన శాస్తి సంగతి అది చెప్ప సాహసింపలేదు అంతలో అది బొల్లని ప్రక్కనున్న గండనివంక తిరిగి "గండా, ఎన్నాళ్లకు కనిపించినావు! కాళ్లు కడిగికొనలే దేమి?" అని అడిగినది.

"నే నింకా ఇంటికి చేరలేదు. నీ రాజును నీకు అప్పగించి పోదామని వచ్చినాను. ఇదుగో!—మరచిపోకు, బొల్లా! మధ్యాహ్నం వేళకు సరిగా మనము మేచయనాయకుల దర్శనము చేయవలె!—పాటీ, మీ అయ్య నీ కే మేమి తెచ్చినాడో అడుగు, పెద్ద సాహుకా రయినాడు లే, వారిని వీరిని దోచి గుంటూరులో!"

ఇట్లనుచు గండడు తన యింటికి చేరికొనెను.

* * *

ఏకశిలానగరమంతయు నిప్పుడు రుద్రభూమివలె నే ఉన్నది. ముందు వచ్చిన భయంకరమైన గాలివాన! దాని ధాటిని సరిచేసి కొనకముందే మీదబడిన మరాటీల దండు! ఎప్పటి కప్పుడు ఉభయసేనలును చనిపోయినవారి దేహములకు సంస్కారములు చేసివేయుచుండెను. కాని యింకను కళేబరములు మూలమూలల మిగిలిపోయినవి. ఏ పొదచాటుననో, ఏ పాడుపడిన యింటిలోననో ఒకటి ఉండును. గాయపడిన వీరుడు ఆత్మరక్షణకో, దాహము తీర్చుకొనుటకో, క్షుధానివారణకో, చికిత్సకొరకు, ప్రాకులాడి ఎక్కడనో ప్రాణములు వదలియుండును. ఎక్కడ నున్న నేమి? ఆ ప్రాణి జీవించి యుండగా కన్నులున్న యాతని యాప్తులకును కనబడి యుండకపోవచ్చును; చెవు లున్న యాతని బంధువు లాతని యార్తవాక్కు లాలించి యుండకపోవచ్చును. ఇప్పుడు ప్రాణము వదలిన పిమ్మట ఆ దేహమునుండి వచ్చు దుర్గంధముమాత్రము, శత్రుమిత్రు లను విచక్షణ లేకుండ, అందరకు దుర్భరమై దాని యునికి గుర్తుకు తెచ్చును! అది చూచువారికి శ్మశానవైరాగ్య మంకురించుటలో విశేషము లేదు.

అందరు మనుష్యు లొక్కసారి బలవన్మరణము పొందుట కాకులకు, గ్రద్దలకు, రాబందులకు, నక్కలకు, కుక్కలకు పెద్ద పండుగ! అవి ప్రాణము లేని వారి కళేబరములనే కాక, సజీవులై వానిని నివారింపలేని స్థితిలో నున్నవారిని గూడ, పొడుచుటకును కరచుటకును వెనుకాడకున్నవి. అభ్యాసవశముచేత వానికొక వింత ధైర్యమును వచ్చినది. ఒంటరిగా నిద్రించుచున్నవారిని గూడ నవి ఇప్పుడు బాధింపసాగినవి. ఇన్ని కాకులు, గ్రద్దలు, రాబందుల్లు, నక్కలు, కుక్కలు ఎక్కడినుండి వచ్చినవో!

ఈ శవము లన్నియు తొలగింపవలెను. పడిపోయిన యిండ్లు బాగుచేయవలెను. కూలిన వాపీ కూపములు పునర్నిర్మింపవలెను. గండ్లు తెగిన కాలువలు సరిపరచవలెను. అపరిశుభ్రమైన తావులు శుభ్రము చేయవలెను. చెడిపోయిన రాజమార్గములు బాగుచేయింపవలెను శిథిలమైన నగరకుడ్యములు పరిష్కరింపవలెను. ఇవి యన్నియు, నగరరక్షణలో నెట్టి ప్రాల్మాలికయు లేకుండ, సాగింపవలసి యున్నది. మారుమూలల దాగియున్న యంతశ్శత్రువులను బహిశ్శత్రువులను గాలించి తగిన శిక్షలు విధింపవలెను. ఈ కార్యక్రమమునకంతటికి మేచయనాయకుడు పూనుకొనెను. అతనికందులో వల్లనాయకుడు మిక్కిలి సహాయపడుచు తోడుగా నుండెను. అంబదేవుడు పంపిన సైన్య మిప్పుడు నగరరక్షణకు నియమింపబడినది.

పూర్వనిర్దిష్టవిధమున నా మధ్యాహ్నమే గండడు బొల్లని తీసికొని మేచయనాయకుల దర్శించెను. వా రిద్దరు దళపతుల వేషములతో వచ్చుట నాయకునకు మిం దాశ్చర్యమై తలయెత్తి సందేహముతో వారివంక నాతడు చూచెను. వెంటనే గండడు అంబదేవుడు పంపిన పత్రములు మేచయకు సమర్పించెను. అవి చదువుచున్నకొలదియు మేచయ యాశ్చర్యము వ్యక్తము చేయుచుండెను. "బొల్లడు చేసిన యకృత్యములు స్వల్పములు. వినను అతడు పశ్చాత్తప్తుడై, రాజద్రోహులను పట్టించుటలో ఈ మధ్య చూపిన నమ్మకముచే, నాతని దోషములు క్షమింపదగినవి, అతని సత్ప్రవర్తనకు గండడే పూటగా నుండునట్లు చేసి, గండనికి అతడు సహాయముగా నుండునట్లు చేయవచ్చును!"

అంబదేవునంతవాని సూచనపత్రమే యైనను, అది మేచయకు శిరోధార్యము!

బొల్లా, నీకే నగరములో పని చాల పడును. ముం దా యోగివేషధారి యగు యువకుని మాకు పట్టింపవలెను!"

"ప్రభూ, చిత్తము! నాకును అందుకే మనస్సు ముందు తొందరపడుచున్నది. ఆ పిమ్మట నాగాచారిని పట్టుకొనవలెను!"

"బొల్లా, నీ వనుక్షణము జాగరూకుడవై యుండవలెసుమా! ఆ వెలిపాలెములో నీ కాపురము మాకు సమ్మతము కాదు!—గండా నీకును!"

వా రిద్దరకును శిలాప్రాకారము లోపల ఒకదాని సరసను ఒకయిల్లు నిర్దేశించి, వారి నం దుండ మేచయ నియమించెను. ఆ సాయంత్రమునకే వా రిద్దరును తమ కుటుంబములతో నూతన నివేశములలో ప్రవేశించిరి. ఆ రాత్రియే బొల్లని కదృష్టము పండినది!

* * *

బొల్ల డా రాత్రి బిచ్చగానివేషముతో నగరసంచార మొనర్చుచుండెను. అతడు సంచరించుచున్నదియు నగరమునం దెల్ల వింతలై యసహ్యకరమైన ప్రదేశములు. ఇంత మహాద్భుతమగు నగరములో గూడ నింత నికృష్టమైన ప్రదేశము లుండునా యని చూచిన క్రొత్తవారి కనిపించును. శిథిలమైన భవనములు, కూలిపోవుచున్న కుడ్యములు, పొదలు పుట్టలు పెరిగి క్రూరజీవుల కునికిపట్లగు జీర్ణోద్యానములు, పాడువడిన బావులు! ఇవి యన్నియు గూడ ఆంధ్రరాజుల రాజధానీనగరములోని వేనా? గబ్బిలముల కంపు, నక్కల కూతలు, అంతకంటె భయంకర మగు మనుష్యుల గుసగుసలు! ఆ ప్రదేశములలో ముష్టివాని కేమి ముష్టి లభించును? ఎక్కడ నైనను దొంగలు ఘాతుకులు నక్కియుండవచ్చును. కాని బిచ్చగాండ్లకు పోరాని ప్రదేశ మేమి?

బొల్ల డిప్పు డొక యాపానభూమిని సమీపించెను. అచ్చటనుండి వినవచ్చుచున్న కేకలు పాటలు తిట్లు దీవనలు అతని నాకర్షించినవి. అక్కడ త్రావినవారికి యథాధికారముగా కులార్ణవ తంత్రోక్తము లగు సప్తభూమికలలో నొకానొకటి ప్రాప్తించినది. తద్విదులగు వారు మద్యముచే గలుగు నుల్లాసమును ఏడు విధములుగా వర్ణించినారు. ఆరంభము, తరుణము, యౌవనము, ప్రౌఢము, ప్రౌఢాంతము, ఉన్మనము, అనవస్థము అని యా యుల్లాసములు వరసగా సప్తభూమికములు. వానిలో ప్రౌఢోల్లాసమును వర్ణించుచు నా తంత్రము,

(19-వ పేజీ చూడుడు)

**శ్రవ్యనాటిక :**

# మీటింగు

## శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

(ఊళ్లో నలుగురు కళాభిమానులు కలిసి కళాసేవాసమితి ఏర్పాటు చేద్దామనుకున్నారు సాయంకాలం అయిదున్నరకు బ్రహ్మయ్యగారింట్లో నిజమైన అభిమానులు మాత్రమే సమావేశమై సమితిఆశయాలు, ఆదర్శాలు, ప్రణాళిక మొదలైనవి నిర్ణయించటానికి నిర్ణయమయింది. సరిగా అయిదున్నరకు గడియారం అరగంట కొట్టుతుంది. చీట్లపేకకత్తెర వేసి కలుపుతున్న చప్పుడు)

కామయ్య: ఇదేమిటి, బ్రహ్మయ్యగారూ? చతుర్ముఖపారాయణ పెట్టారేమిటి?

బ్రహ్మయ్య: ఏదో మనమిత్రులొస్తేనూ! ...మీరుకూడా కలుస్తారా?

కామ : మంచిమాటే! వాళ్లంతా ఏరీ?

బ్రహ్మ : ఎవళ్లంతా?

కామ : మీటింగనుకున్నాం కాదుటండీ?

బ్రహ్మ : నాకు తెలీదే?

కామ : సరిపోయింది! రంగయ్య చెప్పలా?

బ్రహ్మ : లేదే?

కామ : కొంపతీసి మీటింగు మానుకోలేదు, గద? అవతల అర్జంటు పని మానుకుంటేనే నిష్కారణంగా!

బ్రహ్మ : ఇప్పుడు మునిగిపోయిందేమిటీ? కూచోండి, వస్తారేమో. ఎన్నింటికి మీటింగు?

కామ : అయిదున్నరకూ.

బ్రహ్మ : ఇంకేం? ఇప్పటికేగా అయిదున్నరయిందీ? వస్తారు మెల్లిగా. ఈ మీటింగులసంగతి మనకు తెలీంది గనకా!

కామ : నేను మీ ఆట చెడగొట్టటం లేదుగద?

బ్రహ్మ : లేదు, లేదు. ఏమిటీట? ఎందుకీ మీటింగూ?

కామ : కళాసమితి ఒకటి పెట్టాలని. అంతా ఆ సోమేశ్వర్రావు తాపత్రయం. ఎల్లాగైనా ప్రపంచం ఉద్ధరిద్దామనుంటాడు.

బ్రహ్మ . దానికేం? ఏదో ఒక ఉద్యమం ఉండవలసిందే. నలుగురూ వచ్చిందాకా మీరుకూడా ఒకచెయ్యి వెయ్యకూడదూ?

కామ : అదుగో, రంగయ్య రానే వచ్చాడు.

రంగ : అప్పుడే నలుగురూ చేరారే. భేష్! మరి, సోమేశ్వర్రావింకా రాలా?

కామ: నేను తప్ప ఇంకెవ్వరూ రాలేదు. వీరిద్దరూ బ్రహ్మయ్యగారి స్నేహితులు. మీటింగుసంగతి బ్రహ్మయ్యగారికి చెప్పనే లేదుటగా?

రంగ : (ఆత్రంగా) శర్మను చెప్పమన్నానే? చెప్పలేదుటండీ?

బ్రహ్మ శర్మ నాకు కనిపించనన్నా లేదు. ఊళ్లో ఉన్నాడా?

రంగ : ఉన్నాడని సీతారామయ్య చెప్పాడే!

కామ : ఏం పన్లు, రంగయ్యా? బ్రహ్మయ్యగారితో చెప్పమని శర్మతో చెప్పానంటివి. శర్మ ఊళ్లో ఉన్నాడని సీతారామయ్య చెప్పాడంటివి. ఇదేనా పన్లు చేసే పద్ధతి?

రంగ: నన్ను చావమన్నావా. కామయ్యా? శర్మతో తప్పక చెబుతానన్నాడు సీతారామయ్య బ్రహ్మయ్యగారితో మీటింగుమాటే చెప్పనా? రఘువయ్యగార్ని అధ్యక్షుడుగా రమ్మనే పిలవనా? వైజ్ఞానికమండలివాళ్లందర్నీ తప్పక రమ్మనే చెప్పనా? ఒక్కణ్ణే ఎన్ని చోట్లకు తిరగను చెప్పూ?

కామ : అదుగో, సీతారామయ్య ఏంరా, సీతారాముడూ? నిన్ను నమ్ముకుంటే ఇంతే గద. మీటింగని బ్రహ్మయ్యగారికి చెప్పమని శర్మతో చెబుతానన్నావుటగా?

సీతారామయ్య : (మండిపడుతూ) ఎవడా అన్నగాడిద? నే శర్మతో చెబుతానన్నానూ? ఇటువంటి మాటలంటేనే నాకు మండుకొచ్చేది. మనుషుల్ని చెప్పట్టు కొట్టబుద్ధయేదీనూ! అసలు నేను శర్మను చూసి ఎన్నాళ్లయిందీ?

కామ : ఎందుకట్లా నోరు పారేసుకుంటావ్? రంగయ్యలో నువేమన్నావ్?

సీతా : ఏమన్నానా? శర్మ కనబడితే అట్లాగే చెబుతా, బాబూ, అన్నా. పరే అయిందేదో అయిపోయింది. రాఘువయ్యగారేరీ? ఏంరా, రంగయ్యా?

రంగ వస్తూంటారు. ఈపాటికి రావలసిందే మరీ

సీతా : నువ్వెళ్ళి చెప్పావుగదా?

రంగ : చెప్పినట్టే అనొచ్చు.

సీతా : అనొచ్చేమిటి, నీ తలకాయా, నా తలకాయానూ? నువెళ్లి చెప్పలేదా?

రంగ : ప్రద్దానికి నేనే యాడవాలంటే ఎట్లా చెప్పరా, సీతారాముడూ? బ్రహ్మయ్యగారితో మీటింగని చెప్పనా? రాఘవయ్యగారిని అధ్యక్షత కాహ్వానించనా? ఆ వైజ్ఞానికమండలివాళ్ల నాహ్వానించనా? నేనుమాత్రం మనిషిగాదు చెప్పూ! మార్కండేయుల్ని వెళ్లి స్వయంగా పిలుచుకు రమ్మన్నా.

కామ : కొంచెం ఆగు. ఇవాళ నువ్వు మార్కండేయుల్ని ఎక్కడ కలుసుకున్నావ్?

రంగ : మార్కండేయుల్ని నే కలుసుకున్నానా ఏమిటి? రాధాకిష్టుడు కలుసుకున్నాడు.

సీతారామ : కలుసుకున్నాడో లేదో, నీకట్లా తెలుసూ?

రంగ: ఆఁ అదేమన్న మాటరా? తప్పక కలుసుకునే ఉంటాడు.

కామయ్య : మాపాలిటికి నువ్వెట్లా దొరికావోయ్ రంగయ్యా? ఏంపన్లివీ?

రంగ : ఎవరు లోకువంటే సంధి రామయ్య లోకువ, అనండి. అన్నింటికీ నన్నే అనండి. అదుగో రాధాకిష్టుడు. కావలిస్తే వాణ్ణి అడగండి ఏంరా. నువ్వు మార్కండేయుల్ని రాఘువయ్యగారికోసం పంపలా?

రాధా : పంపాలే? ఏం?

రంగ : అందరూ నన్ను దుయ్యబట్టుతున్నారు చూడు

రాధాకృష్ణ : ఈపాటికి మీటింగు ప్రారంభమై ఉంటుందనుకున్నానే? మిగిలినవాళ్లంతా ఏరీ? సోమేశ్వర్రావుగారెక్కడ?

రంగ : వాళ్లు పెద్దవాళ్లూ! వారికోసం మనం కనిపెట్టుకుండాలిగాని వాళ్లు మనకోసం కనిపెట్టుకుండరూ.

రాధాకృష్ణ : వైజ్ఞానికమండలి నుంచి ఒక్క పురుగు రాలేదు మాకావా? అన్నట్టు వాళ్లను, పిలిచావా? సోమేశ్వర్రావుగారు వాళ్లను మరవవద్దని మరీ మరీ చెప్పారు.

రంగ : వాళ్లకి పిలుపు వెళ్లింది. రాకపోతే వాళ్లదే తప్పు.

రాధాకృష్ణ : కొంపతీసి నువ్వెళ్లలేదా ఏం?

రంగ : నే నెన్నింటికని చావను, రాధా? మీటింగని బ్రహ్మయ్యగారికే చెప్పనా? అధ్యక్షుడుగా రమ్మని రాఘవయ్యగార్ని పిలవనా? వైజ్ఞానికమండలివాళ్ళనే ఆహ్వానించనా?

కామ (నిర్ఘాంతపోయి) ఓరి నీతస్సాదియ్యా! నువ్వు ఒక్కపనీ చెయ్యకుండా నే ఎన్నిటికని చావను, ఎన్నిటికని చావనంటావేమిటి? బ్రహ్మయ్యగారికా ఇక్కడ మీటింగని చెప్పకపోతివి రాఘవయ్యగారినా నువ్వు పిలవపోకతివి ఆ వైజ్ఞానిక మండలివాళ్లనూ పిలవకపోతివి ఇంకేమిటి నువ్వు చెసిందీ?

రంగ : కామయ్యా, అందరూ కలిసి నన్ను ఒంటిరిగాణ్ణి చేసి ఇట్లా వేధించటం భావ్యంకాదు నావల్ల ఒక్కచిన్న పొరపాటు జరిగినమాట నిజమేకాని అది ఎట్లా జరిగిందీ, ఎందుకు జరిగిందీ నాకు తెలీటం లేదు

కామ ఏమిటా పొరపాటు?

రంగ ఇవాళపొద్దున ఆఫీసుకు బయల్దేరేటప్పుడుకూడా నేను చెయ్యాలిసిన పనులకు బోలెంత వ్యవధి ఉన్నట్టు కనబడింది. తీరా చూస్తే వ్యవధి కాదుగదా, ఊపిరి పీల్చే అవకాశంకూడా కనిపించలేదు ఆ తొందరలో వాళ్లకాళ్లూ, వీళ్లకాళ్లూ పట్టుకో వలిసివచ్చింది ఒకొక్కరినీ టెలిఫోను మీద అందుకోవటానికి అరగంట పట్టిందంటే నమ్మండి

బ్రహ్మ అయిందేదో అయింది ఇంత మందిమి చేరనేచేరాం. ఆ రాఘవయ్యగారూ, సోమేశ్వరావుగారూ వస్తే మీటింగు ఆరంభించేస్తాంగా? (టెలిఫోన్ మోగుతుంది) ఒక్కక్షణం.. హల్లో! బ్రహ్మయ్యను మాట్లాడుతున్నాను నేనే! అయ్యా? ఆహా, తెలిసింది తెలియటంకాదు. ఇక్కడ అందరూ చేరారుకూడానూ!.. ఎవిడీ? అవును, మీకోసమే ఎదురుచూస్తూన్నాం. మీకో సమా. రాఘవయ్యగారికోసమూనూ. అయ్యా? రాఘవయ్యగారు వస్తాటున్నారు గదా! ఇంకేం? మీరు వెగిరం వచ్చెయ్యండి, ఆరుకూడా కావస్తోంది రేపా? రేపింకో మీటింగున్నదా ఏమిటి?.. అసలు మీటింగే రేపా? ఇవాళ కాదూ? అదేమిటండీ? రంగయ్యగారూ. చూడండి, రంగయ్యగారూ, మీటింగు రేపుటగా?

రంగయ్య. చచ్చాను! ఎందుకురా చేతులూ, కాళ్లూ ఆడలేదూ అనుకున్నాను. రేపా మీటింగూ?

కామ : చూడరోయ్, నీకంగారువల్ల ఎంతమందికాలం వ్యర్థమయిందో.

రంగ నువ్వు నన్నేమీ అనకోయ్. ఇంతకుముందే నువ్వు నావల్ల కించిత్తుసిప కాలేదన్నావు చూడు ఎంతమందిని సమావేశపరిచానో! ఇంకొస్తుంటే సోమేశ్వరావుగార్నీ, ఆ రాఘవయ్యగార్నీ కూడా సమావేశపరిచేద్దును.

బ్రహ్మ : మీటింగు లేకపోతే పోయింది నలుగురూ తటస్థపడ్డారు కూచునే వాళ్లు కూచోండి రెండు పేకలు కలిపి రమ్మీ వేద్దాం

అందరూ : పట్టండి పట్టండి.

(పేక కత్తిరించి కలిపిన చప్పుడు)

చిత్రసమీక్ష

11-10-58

# ఏక్ థీ లడ్‌కీ

## హిందీ చిత్రం

నిర్మాత, దర్శకుడు రూప్ కే శోరీ
నటులు: మీనా, మోతీలాల్, కులదీప్, మజ్నూ ముఖ్యులైనవారు.

రూప్ కే శోరీ నిర్మించిన "ఏక్ థీ లడ్‌కీ" ('అనగనగా ఒక అమ్మాయి') అన్న హిందీచిత్రం ఈనెల 6వ తేదీన మద్రాసు శ్రీకృష్ణాటాకీస్‌లోనూ, కాసినో థియేటర్లోనూ ఒకేసారి విడుదల అయింది

ఈచిత్రం మొదటినుంచి చివరదాకా హాస్యంతో కూడుకొని ఉన్నది కథలో పటుత్వంగానీ, పాత్రపోషణలో ప్రత్యేకమైన ప్రతిభగానీ, సన్నివేశాలలో నూతనత్వంగాని లేకపోయినప్పటికీ ఈచిత్రంలో వినోదానికి ఏ మాత్రమూ లోటు లేదు ఇందులో మరొక విశేషం ఏమిటంటే ఈ హాస్యంలో మొరటుతనంగానీ, అనౌచితి గాని ఏమీ లేదు.

మీనా అనేపిల్లకు నా అన్నవారు లేరు. ఆమె ఉద్యోగంనిమిత్తం ఒక వ్యాపారస్తుణ్ణి చూడబోగా ఆ వ్యాపారస్తుడు అంతకు పూర్వమే హత్య చేయబడి ఉంటాడు. హత్యానేరం మీనాపై పడ్డంతపని అవుతుంది. ఇద్దరు పాత నేరస్థులు ఆమెను ఆశ్రయించి, ఆమెను తప్పిస్తారు. లోకాన్ని మోసపుచ్చటం అలవాటైన ఆ మాజీ ఖైదీలు ఆమెను ఒక గొప్ప హోటల్లో చెప్పి దొంగ నోట్లు అద్వారా హోటలుయజమానిదగ్గిర చెల్లు పుచ్చుకుని కొద్దికాలం నిశ్చింతగా గడుపుతారు. ఇంతలో మీనాకు వారి వృత్తి తెలిసివస్తుంది. ఆమె తన కపటరాణీవేషం మానేసి నానామాటలంటూ వాళ్ళను ధిక్కరించి వాళ్ళల్లోనుంచి పారిపోతుంది.

ప్రమాదవశాత్తు ఆమె ఒక కంపెనీ మేనేజరు (మోతీలాల్) కు స్టెనోగ్రాఫరుగా కుదరటం జరుగుతుంది. మోతీలాల్ తన యజమానికూతుర్ని (కులదీప్) ను పెళ్ళాడబోతున్నాడు. అయితే అతను అర్జంటుగా ఢిల్లీ వెళ్ళవలసివస్తుంది. మోతీలాల్‌కు ఢిల్లీ హోటల్లో గది రిజర్వు అయి ఉన్నది. కాని ఆ హోటల్లో మీనా తన పాతస్నేహితులైన మాజీఖైదీలను చూసి, గది కాన్సిల్ చేసి బయటఉన్న మోతీలాల్‌తో గది దొరకలేదని అబద్ధమాడుతుంది

మరెక్కడా గది దొరకక ఆ రాత్రి ఇద్దరూ పార్కులో బెంచిమీద గడిపి, వానకు తడుస్తారు మర్నాడు ఉదయం మోతీలాల్ సేట్‌ను చూడబోతాడు. మీనా పత్రికలో పనివాళ్లు కావాలన్న ప్రకటన చూస్తుంది పనివాళ్లకు గది ఇస్తామని ప్రకటనలో ఉంటుంది మీనా ఈ సేట్ కార్యదర్శికే వెళ్ళి తానూ, తన భర్తా పనికి కుదురుతామని చెబుతుంది మోతీలాల్ మరి నాలుగురోజులు ఢిల్లీలో ఉండవలసివస్తుంది "మా పెదనాన్నగారున్నారు వాళ్ళింటికి పోదాం," అని మీనా మోతీలాల్‌ను సేట్ ఇంటికి చేరుస్తుంది మీనా అబద్ధమాడిందనీ, ఇంటివాళ్లు తననూ, మీనానూ నౌకరీకి పెట్టుకున్నారనీ తెలిసి మోతీలాల్ మండిపడిపోతాడు గాని గత్యంతరం ఉండదు

ఇంతలో మోతీలాల్ యజమాని, తన మేనేజరు అతీ గతీ తెలియక, కనుక్కుందామని ఢిల్లీ బయలుదేరుతాడు మోతీలాల్, మీనాలు ఢిల్లీలో ఏంచేస్తున్నారో తెలుసుకోవాలనే కాంక్షతో అసూయాగ్రస్తురాలైన కులదీప్‌కూడా తండ్రివెంట వస్తుంది

మోతీలాల్ రహస్యం బయటపడుతుంది కులదీప్ అనుమానం దృఢపడుతుంది మోతీలాల్ పాతఉద్యోగం పోగొట్టుకుని సేట్‌దగ్గర కొత్తఉద్యోగం సంపాదించుకుంటాడు

మీనాతోసహా మోతీలాల్ కాశ్మీరువెళ్ళి శ్రీనగరులో మకాంపెడతాడు పెళ్ళి ఏర్పాట్లు జరిగి శుభలేఖలు వెళతాయి వివాహం ఎట్లాగైనా భగ్నం చేద్దామని కులదీప్ నిశ్చయించుకుని పెళ్ళికి వస్తుంది మీనా పాతస్నేహితులు, మాజీ ఖైదీలిద్దరూ కూడా శ్రీనగరు చేరతారు— గడ్డాలూ, మీసాలూ పెట్టుకుని

మీనా తన పాతస్నేహితులను గుర్తిస్తుంది కాని వాళ్లసంగతి బయటపెడితే నోట్లు ఉదంతం బయటపెడతారని ఆమె నోరు కట్టేసుకుంటుంది వాళ్లుమీనా చుట్టాలమని



షోరీ ఫిలింస్ 'ఏక్ థీ లడ్‌కీ'లో నాయికా నాయకులు మీనా, మోతీలాల్.

ప్రతిభావారి "స్వప్నసుందరి"లో: స్వప్నసుందరి (అంజలిదేవి), ప్రభు (నాగేశ్వరరావు)

చెప్పటమని మకాం పెడతారు పెళ్ళికి వచ్చిన ఆడవాళ్ళకు దొంగలున్నారని భయంపెట్టి వాళ్ళ నగలు భద్రంగా దాస్తామని చెప్పి పుచ్చుకుని మోటారు బోటులో వెళ్ళిపోతారు. వాళ్ళను పట్టుకొనటానికి మీనా మరొక మోటారుబోటులో వెంబడిస్తుంది.

ఆఖరుకు ఆమె వారిని కలుసుకొని నగలిచ్చేసి తన మర్యాద కాపాడమని వాళ్ళిద్దరినీ ప్రాధేయపడుతుంది. చివరకు వాళ్ళు లొంగిపోయి మీనాకు నగలిచ్చేస్తారు.

మీనా మాజీ ఖైదీల స్నేహితురాలనీ, ముగ్గురూ కలిసి చోరీ చేశారనీ కులదీప్ చెప్పిన మాటలు నమ్మి, నగలుపోగొట్టుకున్న స్త్రీలచేత తిట్లుతింటూ విచారంలో మునిగి ఉన్న మోతీలాల్ దగ్గరికి నగలతో మీనా తిరిగి వస్తుంది మోతీలాల్, మీనా, ఇద్దరూ సుఖంగా ఉంటారు.

మోతీలాల్ దగ్గిర మీనా స్టెనోగ్రాఫర్ గా చేరి ఉత్తరాలు బొమ్మలుగా లిఖించటమూ, వాళ్ళిద్దరూ ఢిల్లీలో సేట్ ఇంట్లో నౌకరీ చేయటము, సేట్ తో మాట్లాడటానికి వచ్చిన మోతీలాల్ తో మాజీఖైదీలు పందెం వేసి అతని డబ్బు లాగటమూ మొదలైన సన్నివేశాలు చాలా హాస్యంతో కూడుకొని ఉన్నాయి.

కాశ్మీరులో దొంగతనం చేసి వచ్చిన తరవాత మాజీ ఖైదీలైన తన పాతస్నేహితులను వేడుకొని మీనా వారిలో హృదయపరివర్తన కలిగించే సన్నివేశం చాలా ఉపజ్ఞతో కూడుకుని ఉన్నది.

కాశ్మీరుదృశ్యాలన్నీ ఎంతో రమణీయంగా ఉన్నాయి. ముఖ్యంగా మోటారు బోట్లు రేసు అత్యద్భుతంగా ఉన్నది. ఇటువంటి సంఘటనలను హాలీవుడ్ నిర్మాతలు అత్యుత్తమంగా తీస్తే ఎంతబాగుంటుందో, అందుకు ఏమాత్రమూ తగ్గకుండా ఈ సంఘటన చిత్రించబడింది.

చిత్రంలో పాటలన్నీ విన సొంపుగానే ఉన్నాయిగాని "లారాలప్పా, ఆధాంప్పా" పాట జనరంజక మవుతుంది

ఫొటోగ్రఫీలోనూ, శబ్దగ్రహణంలోనూ, దర్శకత్వంలోనూ సమర్థత కనిపిస్తున్నది.

మీనా ఇతర నటీనటులలో, చుక్కల్లో చంద్రుడులాగా ప్రకాశించింది. ఆమెనటన వివిధ సన్నివేశాలకు తగినట్లుగా, మొదటి నుంచి చివరదాకా నిండుగా ఉన్నది. మోతీలాల్, కులదీప్ కూడా బాగా నటించారు.

ప్రేక్షకుడికి పూర్తి వినోదాన్ని ఇచ్చే కొద్దిచిత్రాలలో "ఏక్ థీ లడ్కీ" ఒకటి

---



# డిటెక్టివ్ సీరియల్: 2




లైబ్రరీ గదిలో, డాక్టర్ శ్రీనివాస రావుతో మాట్లాడుతున్నాడు మాధవ రావు. రంగారావు శ్రద్ధగా వింటున్నాడు.

"మనిషి నిద్రలో లేచి, నడచివెళ్ళి హత్య చెయ్యగలడా? నిజంగా?"

"అటువంటివి జరక్కపోలేదు. కాని హత్య అనగానే అదంతా నటనేమో ననే అనుమానం ఎవరికైనా సరే కలక్క మానదు"

"అసలు నిద్రలో నడవడం అనేది ఎందుకొస్తుంది?"

"ముఖ్యంగా మానసికదౌర్బల్యం, అణిచిపెట్టుకున్న ఉద్వేగం, ద్వేషం, భయం కారణాలు కావచ్చు బలవంతాన అణిచివేసినందువల్ల అవి పాపు ఏదో రూపంలో వ్యక్తమౌతూఉంటాయి. కొందరు కొందరు నిద్రలో లేచి తిరుగుతారు. అలా తిరిగినప్పుడు, ఆ ఉద్వేగాలూ, ద్వేషాలూ, భయాలూ, ఉత్తన్ని లోబరుచుకుంటాయి, మెలకువగా ఉన్నప్పుడు చెయ్యలేని పనిని నిద్రలో పూర్తి చేసెయ్యగలడు."

హాల్లో మాటలు వినిపించాయి.

"అదుగో ఆయనే వస్తున్నట్టున్నాడు, మీరాపక్కగా కూచుని ఆయన్ని పరీక్షిస్తూ ఉండండి నేనాయనతో మాట్లాడతాను"

దుర్గయ్య వొణికిపోతూ వచ్చాడు వచ్చి కుర్చీలో కూచుంటూనే "నా కొంప ముంచాడండి ప్లీడరుగారూ. నాలుగు రోజుల్నుంచి మా కంపెనీఆఫీసు తాళం వేసి ఉందిట మా వాటాదారేం చేశాడో తెలియదు నాతో వ్యాపార పరిష్కారానికొచ్చిన వాడు ఒక్కముక్కైనా చెప్పలేదు."

"మీ వాటాదారిప్పుడెక్కడున్నాడు?"

"ఈ వూరొచ్చాడు గా. ఇక్కడే వున్నాడు"

"మీకీ కబురెలా తెలిసింది?"

"నా భార్య బెజవాడొచ్చింది రాజీకి ఒప్పుకునేటట్టుందని ఒక మధ్యవర్తి రాస్తే అది చూచుకుని మా రామచంద్రరావుని బెజవాడ పంపాను. అతను మా కంపెనీ ఆఫీసు కెళ్ళేసరికి మూసేసివుందిట"

కొంతసేపు అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. ఉన్నట్టుండి దుర్గయ్యకి వొణుకుపుట్టింది వొణుకుతూనే. అటూ ఇటూ బిత్తరిచూపులు చూడ్డం ఆరం

[గడచిన కథ. దుర్గయ్యకి రాత్రి నిద్రలో నడిచే అలవాటుంది. తన్ని చంపుతాడని భయపడిన భార్య పుట్టింటికెళ్ళి అన్నగారి ఆసరాతో దుర్గయ్యమీద దావా తెచ్చింది. దుర్గయ్య మనస్సు స్థిమితంగా లేదని, అతని వ్యాపారంమీదా, ఆస్తిమీదా, సంరక్షకత్వం ఇవ్వాలనీ ఆవిడవాదం. ఆరోగ్యం కుదుర్చుకోడానికి మేనగోడలు కమలతోనూ, తనకి ఆసరాగా ఉన్న రామచంద్రరావుతోనూ, బెంగుళూరు వెళ్ళాడు దుర్గయ్య. అతను లేనిసమయం చూసి వ్యాపారంలో అతని వాటాదారు అంకరాజు వాటా పంచమని తగువుపెట్టాడు. ఈ చిక్కుల్ని పరిష్కరించడానికి దుర్గయ్య ప్లీడరు మాధవరావుని నియోగించాడు]

క్షించాడు. రెండు నిమిషాల్లో తగ్గిపోయింది. మాధవరావు మెల్లిగా చెప్పాడు. "వ్యవహారాలన్నీ బెజవాడలోనే పరిష్కారం చేసుకోవచ్చును. మీ వాటాదార్ని బెజవాడ వెళ్ళిపొమ్మని చెప్పండి. మీరుకూడా వెంటనే అక్కడికి వెళ్ళిపొండి. నేనిక్కడ నాపనులు సర్దుబాటుచేసుకుని రెండు మూడు రోజుల్లో బెజవాడ వస్తాను. మీరేమీ భయపడ నవసరం లేదు. నేను చెయ్యదగినదంతా చేస్తాను."

దుర్గయ్య ఈమాటు మెల్లిగా ఏదో ఆలోచించుకుంటూ నడిచివెళ్లాడు. హాలు దాటి వెళ్లడం చూసి డాక్టర్ శ్రీనివాసరావు అన్నాడు. "మీ క్లయింట్ బలే వాడే మాధవరావుగారూ! ఈ వొణుకు, చేతులు బిగుసుకుపోవడం ఇదంతా తమాషాగా వుందే!"

"ఏం, నటిస్తున్నాడంటారా?"

"తప్పకుండా. నిద్రలో లేచి నడవడం కూడా అంతే అయుంటుంది. ఇదంతా నాటకం. వేరే మనిషిని పరీక్ష చెయ్యనక్కర్లేదు."

"నటించడం ఎందుకూ అనే నా సందేహం. దీనివల్ల అతనికే నష్టం. ఆస్తిని పెళ్లాని కొప్పగించి దణ్ణం పెట్టాలి సొస్తుంది కూడా."

"ఏమో. ఇతను చెప్పేదంతా నిజం కాదు. ఏదో ఆంతర్యం ఉంది."

* * * *

గాంధీనగరంలో దుర్గయ్యగారి మేడ పెదది. ప్రహరీ దాటగానే చక్కని పువ్వుల తోటవెనక మేడ. పై అంతస్తులోనూ, కిందకూడా పొడుగ్గా వరండాలు. కింద హాల్లోకీ రెండుగదుల్లోకీ వరండాలోనుంచి ద్వారా లున్నాయి. హాలుకీ, ఈగదులకీ వెనకనూ, పక్కలనూ చాలా గదులున్నాయి. అలాగే పైఅంతస్తులోనూ, వెనక విశాలమైన దొడ్డీ, తోటా ఉన్నాయి.

ప్లీడరు మాధవరావు సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌లో దిగాడు. దుర్గయ్యగారి మేడలో పైవరండావద్ద పడమటివైపుగది ప్రత్యేకించి ఇచ్చారు. పడమటివైపునే రెండు గదుల్లోనూ, హాల్లోనూ, దుర్గయ్యా, కమలా మసుల్తూఉంటారు. తూర్పువైపువరండా దగ్గిరగదిని దుర్గయ్యగారి తమ్ముడు సుశ్నేశ్వర్రావు వచ్చినప్పుడల్లా వాడుకుంటాడు; ఆ వెనక గది తాళంవేసి వుంటుంది. దుర్గయ్యగారి భార్య పార్వతమ్మ తన సామాను కొంత ఆ గదిలో దాచుకుంది.

ఆరోజు పూర్ణిమ. అట్టే సందడిలేని ఆ తెల్ల మేడ వెన్నెల్లో తెచ్చుకున్న వింత అందాన్ని చూసేవాళ్లు లేరన్నట్టు ఉంది. దుర్గయ్య ఇంకా ఇంటికి రాలేదు. వరండాలో నాలుగు కుర్చీ లున్నాయి. కమలా మాధవరావు మెల్లిగా మాట్లాడుకుంటున్నారు.

"అదా సంగతి? వాటాదారూ, మీ అత్తన్నగారూ ఏకమైనారన్న మాట."

"వాళ్లంతా ఏం తలపెట్టారో తెలీడం లేదు, ప్లీడరుగారూ. రాజీకి రప్పించిన వాళ్లు రామచంద్రరావు వెళ్లేసరికి ఎటూ ఏమీ చెప్పక చుట్టూ తప్పుకున్నారు."

"అవును పరాయివాడితో మాట్లాడ్డానికి సందేహించారేమో?"

"అబ్బే, రామచంద్రరావుతో మీ అత్త చాలా చనువుగా మాట్లాడుతుంది. అటువంటి దేం లేదు."

కొంతసేపు ఇద్దరూ మాట్లాడకుండా ఆలోచిస్తూ కూచున్నారు. తరవాత "నాకీ రాత్రి భయం. వేస్తోంది ప్లీడరుగారూ" అంది మెల్లిగా కమల. "ఏం భయ, మెందుకు?"

"ఇవాళ పౌర్ణమి. మా మామ అసలే రోషంగా ఉన్నాడు. రాత్రి ఏంచేస్తాడో అని భయంగా ఉంది."

"మరేం ఫరవాలేదు. డాక్టర్‌కి కబురు పంపి నిద్రకి మందు తెప్పించండి. అన్నట్టు మర్చిపోయా, ఒక్కసారి నేను ఇక్కడ మీ యింటి డాక్టరుతో మాట్లాడాలి. అది ఈపూటైతేనే మంచిది."

"అల్లాగే. మాకార్లో వెళ్ళండి. మీరొస్తున్న సంగతి ఆయనకి తెలుసును. నేను కారు చెప్పొస్తాను. ఈ లోగా మీరు దుస్తులు మార్చుకోండి."

"ఇంకో విషయం. ఆ వాటాదారు పేరేమిటి? ఎక్కడుంటున్నాడు."

"అతనిపేరు అంకరాజు. పాతఊళ్ళో ఉంటాడు."

"అత నెక్కడికీ పారిపోకుండా కనిపెట్టవలసిన అవసరం ఉంది. మనకి, మంచి నమ్మకస్తుడైన మనిషి కావాలి. అత నెక్కడెక్కడి కెడుతున్నాడో కూడా కనిపెట్టగలగాలి."

"మాకు ఈ కొనిరోజుల్లో నమ్మకస్తులెవరో తెలీకుండాపోయింది ప్లీడరుగారూ. రామచంద్రరావున్నాడు, అతడొక్కడే ఏం సహాయంచేసినా. కాపుదలకయితే టెన్నిస్‌క్లబ్బులో అతని స్నేహితు లున్నారు."

"అందరికీ తెలవకూడదు. చాలా జాగ్రత్తగా ఉండాలి. అలా వీలయితేనే రామచంద్రరావుతో ఏర్పాటుచెయ్యండి."

"కాపుద లెందుకు?"

"అతను డబ్బు చేతికొచ్చినమట్టుకు పట్టుకుని దాటేస్తాడని అనుమానంగా వుంది."

"అ దల్లా?"

"తరవాత ఆలోచిద్దాంలెండి."

మాధవరావు డాక్టరింటినించి తిరిగొచ్చేసరికి పది గంటలయింది. మేడమీద వరండాలో దుర్గయ్య అటూ ఇటూ కాలు కాలిన పిల్లిలాగ తిరుగుతున్నాడు. హాల్లో కమల చేత్తో పుస్తకంపట్టుకుని చదవకుండా దీర్ఘంగా ఆలోచిస్తూ కూచుంది. వరండా చివర మడతమంచం ఒకటి కనిపించింది. ఎవరోపడుకున్నారు అక్కడ.

మాధవరావు మెట్లెక్కినంతలోనే దుర్గయ్య గబగబా వచ్చి గుసగుసలాడుతూ చెప్పాడు.

"పొద్దుట్నించీ అంకరాజు కనిపించడం లేదు ప్లీడరుగారూ."

"ఏమయాడు? వాకబు చేశారా?"

"ఆఁ. వాకబు చేశాను. అంతా ఏదోతమాషాగా ఉంది. ఎక్కడికెళ్ళాడో ఎవరికీ తెలియదుట. వాడూ మా బావమరిదీ కలిసి ఏదో కుట్ర చేశారని నాకు గట్టి అనుమానముంది."

"మీ బావమరి దెక్కడున్నాడు?"

"ఒక మధ్యవర్తిని తీసుకుని ఇక్కడికొచ్చాడు. నా భార్యకూడా వచ్చింది. ఆ మంచంమీద పడుకున్నవాడే మధ్యవర్తి. కావలసినవాడే ననుకోండి."

"ఆఫీసు ఎందుకు మూసేశారో కనుక్కున్నారా?"

"ఆఁ. సర్కారు జప్తు నోటీసు ఇచ్చారుట. ఆ సాకు తీసుకుని అంకరాజు ఆఫీసు మూయించేశాడు. ఇవ్వాళే మళ్ళీ ఆఫీసు తెరిచాం. కాని ఏం ప్రయోజనం, వ్యాపారం లేదు; ఏం లేదు. అంతా నిల్చిపోయింది."

"సరేలెండి కనుక్కుందాం. మీరు వెళ్ళి పడుకోండి. మరేం ఫరవాలేదు. ఎవ్వరూ తప్పించుకుపోలేరు. మీ కా బెంగ అక్కర్లేదు. మీరు నే చెప్పినట్లా వింటే సరి."

"మీరు చెప్పేది ఏదయినాసరే అక్షరాలా పాలిస్తాను. మీ రున్నారుకాబట్టి నా కింకా కొంత ధైర్యం ఉంది."

"సరే వెళ్ళి పడుకోండి. నేనూ పడుకోవాలి." అంటూ తన గదిలో కెళ్లాడు మాధవరావు. దుర్గయ్యకూడా వెళ్ళిపోయాడు.

మాధవరావు గది కిటికీలోనుంచి పూలతోట కనపడుతోంది. నీళ్ళకుండీలో నీళ్ళపై వెన్నెల తళతళలాడుతోంది.

హాల్లో లైటు ఆర్పేసి కమల చప్పుడు

కాకుండా గదిలోకొచ్చింది. లైట్ వేసింది. మంచానికి దూరంగా ఉన్న కుర్చీ లాక్కుని కూచుంది.

"ఈరాత్రి నాకు చాలా భయంగా ఉంది ప్లీడరుగారూ."

"ఎందుకు?"

"ఇవాళ పౌర్ణమి. మామ తప్పకుండా నిద్రలో లేచి నడుస్తాడు."

"ఇంట్లో ఇంతమంది ఉండగా భయమెందుకు? చదువుకున్నావు. ఇలాటి పరిస్థితిలో భయపడ్డం అనవసరమని నీకు తెలుసును. నీ గదికి లోగడియ వేసుకో. అదే చాలునే?"

"అవును. అయినా నన్ను గురించి కాదు భయం."

"అయితే ఒకటి చెప్పగల్వా? మీ అత్త ఎల్లా రావడాని కొప్పుకుంది? ఇవాళ పౌర్ణమి అని తెలుసుకదా."

"మధ్యవర్తితో రామచంద్రరావు మాట్లాడి ఒప్పించాడు. ఆవిడతో రాజీపడకపోతే ఆవిడ అన్నగారూ, అంకరాజూ కలిసి ఏంచేస్తారో అని మామయ్య భయపడ్డాడు. అందువల్ల రామచంద్రరావుని పంపి పిలిపించాడు. రామచంద్రరావు మాటంటే ఆవిడకి మంచి గురి ఉంది."

"ఇప్పుడా చురకత్తి ఎక్కడుంది?"

"హాలు అలమార్లో పెట్టి తాళం వేశాను."

"తాళం చెవులెక్కడున్నాయి?"

"నా గదిలో డ్రాయర్లో. ఇంకోటి కూడా చేశాను. మామ పడుకున్న గదికి బయట తాళం వేశాను."

"తాళం ఎందుకూ? గొళ్లెం పెట్టితే చాలదూ?"

"ఎందుకేనా మంచిదని తాళం వేశాను. మళ్లీ మామ లేవకముందే తీసేస్తాను."

"మంచిదే,"

కొంతసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉన్నారు. తరవాత "నే వెడతాను" అని చెప్పి కమల వెళ్ళిపోయింది.

* * *

మర్నాడు చీకటితోనే మాధవరావు లేచాడు. కాలకృత్యాలన్నీ తీర్చుకుని మడతబట్టలు కట్టుకుని వరండాలో కొచ్చేసరికి దుర్గయ్య ఎదురైనాడు. పైన కండువా, చేతిలో కర్రా హడావిడిగా ఎక్కడికో ప్రయాణమాతున్నాడు.

"రాత్రి అంకరాజు ఇంటి కొచ్చాట్టండీ ప్లీడరుగారూ. రామచంద్రరావిప్పుడే కబురు చెప్పి మళ్లీ అక్కడికి వెళ్లాడు. అతనితో మాట్లాడి మెల్లిగా ఇక్కడికి తీసుకొస్తాను."

"రాత్రిబాగా నిద్రపట్టిందా?"

"ఆ, ఇన్నిరోజులికి నిన్నరాత్రే కంటి నిండా నిద్రపోయానుప్లీడరుగారూ. నిజంగా మీరు రావడంతో నాకు సగం బెంగ తీరిపోయింది.

"మరి వెళ్ళి త్వరగా వచ్చెయ్యండి. ఏదో తేల్చేసి నేను ఇవ్వాళే తిరిగి వెళ్ళిపోవా లనుకుంటున్నాను. అందరూ కలిసి వచ్చేటట్టే కనిపిస్తున్నారు. కలిసివస్తున్నప్పుడే ముగించేసుకోడం మంచిది."

"అల్లాగే నండి, నేనూ అదే మొక్కుకుంటున్నాను. ఇప్పుడే ఇక్కడున్నట్టు వొచ్చేస్తా." అంటూ కొంచె తాపీగా నడిచివెళ్ళిపోయాడు. మనస్సు కొంత కలకదేరినట్లు ముఖమే చెపుతోంది.

మాధవరావు హాల్లోకి వెళ్ళాడు. కమల అతనికోసమే కనిపెట్టుకూర్చున్నట్టు రాగానే లేచి నిలబడింది! కొంచెం ఉత్సాహంగా కూడా ఉంది.

"రామచంద్రరా వొచ్చాడు. అంకరాజు రాత్రి ఇంటి కొచ్చాట్ట. ఆయన్ని తీసుకురావడానికి మామ ఇప్పుడే వెళ్లాడు."

"మీఅత్త తరఫున వొచ్చిన వాళ్ళేరీ?"

"ఇంకా లేవలేదు. వసారాలో పడుకున్నాయన మాత్రం లేచాడు. కింది కెళ్ళినట్టున్నాడు."

ఇంతలో వంటవాడొచ్చి "అమ్మగారూ వెండిగ్లాసులు అలమార్లోఉన్నాయి. అలమారుతాళం ఎక్కడుందండి" అని అడిగాడు.

"నా గదిలో డ్రాయర్లో ఉంటుంది తీసుకో."

మళ్ళీ రెండు నిమిషాల్లో వొచ్చి "అక్కడ లేదండమ్మగారూ"

కమల ఒక్క ఉదుటున లేచి నిలబడింది. తత్తరపాటుతో మాధవరావుకేసి ఒక్కసారి చూసి, వంటవాడితో "సరిగా చూడు, అక్కడే ఉంటుంది. ఎక్కడికి పోతుంది?" నేనేగా అక్కడ పెట్టాను?" అంటూనే వంటవాడి వెనకాల వెళ్ళింది. చడీ చప్పుడూ కాకుండా మాధవరావు గదిగుమ్మందాకా వెళ్ళి పక్కగా నిలబడి గమనిస్తున్నాడు. కమల ఇది గమనించింది. కాని చూడనట్టుగానే వెళ్ళి డ్రాయరు తెరిచి అరలో ఈ మూలా, ఆ మూలా వెతికింది. తాళంచెవి తీసి "ఇదేమిటి ఇక్కడే ఉంటే?"అంటూ వంటవాణ్ని కసిరింది. మాధవరావు హాల్లోకి వచ్చేసి కూచున్నాడు. వెనకాలే కమలా వచ్చింది. వంటవాడు అలమారు తెరుస్తున్నప్పుడు ఆత్రంగా చూసింది. తెరిచినతరవాతనే దగ్గిర కెళ్ళింది. ఏదో పరికించి చూసింది. గబగబా వంటవాణ్ని పక్కకి గెంటేసి తాను వెతకడం ఆరంభించింది.

కమల ముఖం పాలిపోయింది. వొణుకుతూన్న చేతుల్తో చెంగు ఉండచుట్టి నోటికడ్డం పెట్టుకుంది.

"ఏమయింది?" అంటూ మాధవరావు లేచాడు."

"కత్తి..."

"..."

"...లేదు"

"ఎక్కడికి పోయింది? ఎవరు తీసి వుంటారు?"

"ఏమో ఏం తెలీడంలేదు. ఒక్కసారి మామగది చూద్దామా?"

"ఎందుకు?"

"అతని తలగడకింద ఉందేమో!"

అక్కడికెల్లా వెడుతుంది?"

"రాత్రి నిద్రలో అది పట్టుకు తిరిగినట్టయితే, మళ్ళీ పడకమీద చేరేముందు కత్తిని తలగడకింద పెట్టుకోడం మామూలు. నిన్న పొద్దున్న అల్లాగే జరిగింది."

ఇంక భయమెందుకు? మామూలుగా అక్కడే వుంటుంది వెళ్ళిచూడూ..."

అంటూ ఉన్నంతలోనే మాధవరావుకి తళుక్కున ఒక భావం మెరిసింది

"మీ అత్త..."అంటూమధ్యలో ఆపేశాడు.

"నడు నేకూడా వస్తాను." అన్నాడు. ఇద్దరూ కలిసి దుర్గయ్యపడకగదిలో కెళ్ళారు. మాధవరావే ముందడుగేశాడు. వెళ్ళి మెల్లిగా తలగడ ఎత్తాడు. అది చూసి కమల అదిరిపోయింది. మాధవరావు నిరాంతపోయాడు.

తలగడకింద కత్తి వుంది. కత్తి చివర నాలుగంగుళాలమేర ఎర్రగా నెత్తురంటి వుంది. తలగడగలీబుకీ, పరుపుగలీబుకీ నెత్తుటి మరక లంటివున్నాయి.

[సశేషం]

---

# రుద్రమదేవి

(11-వ పేజీ తరువాయి)

"పీత్వా పీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే
ఉత్థాయ చ పునః పీత్వా పునర్జన్మ న విద్యతే !!
యత్సుఖం కులనిష్ఠానాం కులద్రవ్య నిషేవణాత్
తత్సౌఖ్య మేవ మోక్షం స్యాత్ సత్య మేవ న సంశయః||"

అని వర్ణించినది. ఆ తంత్రములో చెప్పిన మోక్షమున కర్హులగువారు పలువురా పానగోష్ఠిలో నున్నారు.

అట్లు మోక్షస్థాయి నందుకోలేక ఆరంభ తరుణ యౌవన భూమికలలో నున్నవారు ద్యూత మాడుచుండిరి. వారిలో నారంభ భూమికలో నున్నవా డొకడు చప్పున ప్రక్కవాని చేయి పట్టుకొని వాడు చేసిన మోసము బయలుపెట్టెను. వెంటనే ఆ సాయంత్రమునుండి అతనితో నాడి ధనము కోల్పోయినవారందరు నామోసగానిపై బడిరి. అతడు ఎంత పారిపోవ ప్రయత్నించినను, మిగిలిన త్రాగుబోతులు పోనీయక వానిని పొదివి పట్టుకొనిరి. తలవరులను పిలువగా సమీపములో నున్నవారు ఇరువురు వచ్చిరి.

మరుక్షణమున నక్కడ కితవధర్మాసనము ఏర్పడెను. ఆ ధర్మాసనము ప్రభుస్థాపితము కాదు. అక్కడి కితవులే అందులో పెద్దలు. వారే ధర్మము విచారించి శిక్ష విధింతురు. అది తలవరులు విధిగా నిర్వర్తింప వలసినదే! అట్లే జారులలో తగవులు ప్రాప్తించిన జారధర్మాసనము తీర్తురు. కితవధర్మాసనములు జారధర్మాసనములు తీర్చుట ఆ చాటుగొందులలో సర్వసామాన్యము!

అట్లు ముందు చేయి పట్టుకొనినవాడు రెండవ కితవుడు చేసిన మోసము వర్ణించెను. అక్షముఖము ముందు తన కనుకూలముగా స్పష్టముగా కనిపించినది. అంతలో నా మోసగాని హస్త మావైపు ప్రసరించినది. అట్టె అక్షముఖము మారిపోయినది! వెంటనే తా నాతని చేయి పట్టుకొనినాడు.

దానికి నిందితుడైన కితవుడు ఆతడు చెప్పినదంతయు నబద్ధమని వాదించెను. ఆ నిందితుడు విదేశవర్తకునివలె నున్నాడు. అతడు విలువగల వస్త్రములు నాభరణములు ధరించి యుండెను. అతని వాక్కు కూడ సౌమ్యమై, నిరపరాధి యనియే అందరకు అనిపించుచుండెను. పాప మేదో పొరపాటు జరిగియుండవలెను. కాక మొదటివాడే మోసగాడో!

కాని అత డానాడు ధన మోడుచుకొన్నవా రందరును అట్లే సాక్ష్య మిచ్చిరి. అందరును ఆతని హస్తచాలనము గమనించినవారే. కాని కేవలము అక్షము స్పృశించినట్లు చెప్పగలవారెవరును లేరు. మొత్తముమీద నతనికి హస్తలాఘవవిద్య యేదియో అభ్యస్తమని వారు నిర్ణయించిరి. మరి కాకున్న సరిగా నావేళకే హస్తచాలన మట్లేల జరుగవలెను?

గోవిందశర్మ యాదారిన పోవుచు ఇక్కడ నీ ధర్మాసనము తీరినారే మని ప్రశ్నించెను. ధర్మాసనము తీరిన పెద్దలు విషయము నివేదించి గోవిందశర్మను ఏమి చేయుట సమంజస మని యర్థించిరి. గోవిందశర్మ వెంటనే బదులు చెప్పెను.

"ఇందరు అక్షవిదులు కూడినారు. దీనికి పాణ్మాసచింత ఏల నండీ! ద్యూతములో హస్తలాఘవము ప్రదర్శించినవారికి కరచ్ఛేదము!"

వెంటనే ధర్మాసనము కూడిన పెద్దలు గోవిందశర్మ యుపదేశ మంగీకరించి తీర్పు చెప్పిరి. "హస్తచ్ఛేదము!" తలవరులు ఆ వర్తకుని పట్టుకొనబోవుచుండగా నాతడు తప్పించి పారిపోవుచుండెను. సరిగా నప్పుడే బొల్ల డెదురై యాతని దృఢముగా బంధించి "ఇతడు దొంగ! నా తొమ్మిదివందల యేబది మాడలు హరించెను." అనెను. భిక్షుకు డా మాట లనుచుండుటచే నందరికి నవ్వు వచ్చెను!

అంతలో చుట్టుపట్టులనుండి అపూర్వమైన భాషలో ఏదో మాట్లాడుచు, నా బంధితుని తప్పించుటకు పాతికమంది మనుష్యులు అక్కడివారిపై కలబడిరి. వెంటనే గండని పరివార మా యల్లరి మూకను మాయాకితవునితోపాటు బంధించి మేచయనాయకున కప్పగించెను. గండడు పరివారముతో బొల్లని ననుసరించుచునే యుండెను.

ఈవిధముగా మేచయ కన్నులు గప్పి ఎప్పటికప్పుడు మారువేషము ధరించి తప్పించుకొనుచున్న అజ్ఞాతయోగి బొల్లని జాగరూకతచే నీనాడు వశమయ్యెను.

* * *

బొల్లనియు, గండనియు నదృష్ట మంతటితో నాగలేదు. వా రానాడు అర్ధరాత్రమువరకు నగరసంచార మొనర్చి జైనవసది చేరి, పాడుపడియున్న దానిలో నొక గదియందు శయనించిరి. అదియే పూర్వము జైనసిద్ధు డున్న గది! వారు నిదుర నటించుచుండిరి కాని నిదురపోవుటలేదు. అంతలో నా గదిగోడ యొకటి కదలెను. అందుండి యొక వ్యక్తి గదిలోనికి మెమ్మదిగా నడుగిడుచు, దారి కానక తన చేతిలో నున్న కత్తి క్రింద పెట్టి, వెలుగు చేయుటకై చెకుముకిరాయి కొట్టుచుండెను. అప్పటికే జాగరూకులై యున్న గండడు, బొల్లడు చివ్వన లేచిరి. గండడు క్రింద పెట్టియున్న కత్తి పట్టుకొనెను. బొల్లడు ఆ వ్యక్తినే పట్టుకొనెను. వెలుగు చేసి పరీక్షింపగా నాతడు నాగాచారి! అతనియొద్ద ప్రభువుల ముద్ర లెన్నియో లభించెను.

తిక్కచమూపతియు, గోనగన్నారెడ్డియు మహాసైన్యములతో కదలిపోయి, యటునైపులనుండి శత్రుసైన్యములు వచ్చుటలేదని తెలిసినప్పటినుండియు, మేచయ కెవరో అబద్ధవార్తలు నమ్మకమైన విధమున బంపుచున్నా రని యనుమానము కలిగెను. దేవగిరివైపునుండి యెట్టి యలజడియు లేదని వార్తపై వార్త వచ్చుటయు, అటునుండియే మహాసేన దండెత్తివచ్చుటతో, నాతని సందేహము ధ్రువపడెను. నవరాత్రములనాటి సమ్మెలో పాల్గొని యుద్యోగములు పోగొట్టుకొనిన కరణములే దానికి కారకులై యుండవచ్చుననియు, నాతనికి దోచినది. జైనవసదిని పట్టుకొని నప్పుడందు దొరకిన పత్రములు పరీక్షించినకొలదియు, నాతని కా యూహ నిజమని నిశ్చయమైనది.

అన్నిటికి మూలకారకుడు నాగాచారి! అతడు కనబడుటలేదు. కాని యాతడు నగరము వదలలేదు. అతనికై నగరమెల్లెడ గాలించుచున్నను కనబడుచుండలేదు. ఈనాడు మేచయవసదికి మరల కొన్ని పత్రములు చేరినట్లు నటన చేసెను. అక్కడ సెట్టి రక్షకభటులను కాపుంచనట్లు చేసి, గండని బొల్లని నర్ధరాత్రమున కచ్చుటికి పంపెను. మేచయయత్నము ఫలించినది!

(సశేషము)

## కథానిక:

అసలు ఎవరు పేరంటకానికి పిలిచినా వెళ్ళేమనిషికాదు సావిత్రమ్మ!... ఒక వేళ ఎవరింటికయినావెళితే, తన హోదాకి తగినటువంటి గౌరవం అక్కడ లభించదేమో అని ఆమె భయం! ఆకారణంచేతే ఆమె సాధారణంగా ఎవ్వరింటికీ వెళ్ళదు. తనభర్తకు ఆఫీసులో ఎంతగౌరవం జరుగుతున్నదో, అంతా తనకూ అమ్మలక్కల సంఘంలో జరగాలని ఆమెకోరిక!—ఏమయినా తాసీల్దారుగారి భార్య అన్నందుకు అంతటి హెచ్చుస్థాయిలోనూ తనని సంఘం గౌరవించాలని ఆమె ఆశ!......

మరలాంటి ఉద్దేశంతో ఉన్నామె, పార్వతమ్మ పిల్లడిని ఉయ్యాలలో పెట్టేటప్పుడు రమ్మని పిలవగానే పేరంటకానికి వెళ్ళడానికి ఎందుకు సిద్ధపడింది? ఆమేం అంత తెలివితక్కువతనంగా వెళ్ళ సంసిద్ధురాలు కాలేదు!... పార్వతమ్మ భర్త తన భర్తదగ్గర ఓ చిన్నగుమస్తా. ఎంతో వినయవిధేయతలతో మెలిగే మనిషని తన భర్తచెప్పగా వింది.మరి అలాంటివానిభార్య వంశానుగతంగా కాకపోయినా, పరిసర ప్రభావంచేతనయినా ఇంచుమించుగా అదేరకపు సహజాతంతో కూడుకొని ఉంటుందని సావిత్రమ్మ ఉద్దేశం. అదీకాక, "పార్వతమ్మ మర్యాదా తెలిసిన మనిషని" ఆ వీధివాళ్లు చెప్పగా వింది. అంచేత అక్కడికి వెళ్ళినవారందరిలోకీ తనదే ప్రథమస్థానం అవుతుందనే ఉద్దేశంతో వెళ్ళడానికి సంసిద్ధురాలయింది...

ఇక, అక్కడికి వెళ్ళేవారు తెచ్చేకానుకలకన్నా తను పట్టుకెళ్ళేవి గొప్పగా ఉండాలనే ఉద్దేశంతో ఎక్కువవిలువయినవి పట్టుకుంది. కారు సిద్ధంచేయించమని బంట్రోతుతో చెప్పింది.

కారులో కూర్చొని ఉన్నంతసేపూ సావిత్రమ్మకు ఒకటే ఆలోచన!... తను అలా గుమ్మంలో కాలుపెట్టీ పెట్టడంతోనే అక్కడ కూర్చొనిఉన్నవాళ్లందరూ లేచి నిలబడతారని, అప్పుడు పార్వతమ్మ తన దగ్గరకు వచ్చి, చేయిపట్టుకొని లోపలకు తీసుకెళుతుందనీ, అందరినీ చాపమీద కూర్చోపెట్టి, తననిమాత్రం ఓ కుర్చీమీద కూర్చోమంటుందనీ, తను తెచ్చిన కానుకలను చూచి పార్వతమ్మ మురిసిపోతుందనీ, అక్కడ చేసే ప్రతిపనికీ తన సలహా ఉంటుందనీ, ప్రతీఒక్కరూ తనపట్ల భయభక్తులతో మెలుగుతూఉంటారనీ, అక్కడ ప్రథమస్థానం తనదేననీ ఇంకా రకరకాల ఊహలలో మునిగింది. అంతట్లోనే ఆమె ఊహాల కంతరాయం కలిగింది. కారు పార్వతమ్మగారి గుమ్మంముందు ఆగింది.

కారుహారను వినడంతోనే లోపల నుంచి పార్వతమ్మ పరుగెత్తుకొని వచ్చి, "రండక్కయ్యగారూ" అని సావిత్రమ్మను ఆహ్వానించింది. తనని "అక్కయ్యగారూ," అని సంబోధించినందుకు సావిత్రమ్మకు వళ్లుమండింది. పేరుపెట్టిపిలవకూడదూ? మహా బంధుత్వం లావయిపోయినట్లు!... అదే ఏ కలక్టరుగారి భార్యో తనని, "అక్కయ్యగారూ," అని సంబోధించి ఉంటే ఎంతయినా సంతోషించేది. ఒక గుమస్తాభార్య తనని, "అక్కయ్యా," అని అనడం ఎంతేనా చిన్నతనమనిపించింది సావిత్రమ్మకు!...కానీ ఏమనగలదు?—కారులో ఉంచిన కానుకలను

**శ్రీ ఆకుండి నారాయణమూర్తి**

పట్టుకురమ్మనమని డ్రయివరుతో చెప్పి, పార్వతమ్మతో కలసి లోపలకు వెళ్లింది.

అందరూ వచ్చేసే ఉంటారనుకుంది. కానీ తనే మొదట వచ్చినమనిషయింది. అక్కడకు వచ్చేవారందరిలోకీ ఓమోస్తరు హోదాతో ఉన్నతను, ముందుగా రావడం, "ఇండియన్‌పంక్ట్యువాలిటీ"కి విరుద్ధమేమో అనుకుంది!...ఇక, అక్కడ తనకు ఓకుర్చీ ఏర్పాటు చేసుంటుందని అపోహపడింది. కానీ అలా ఏమీ జరగలేదు. "ఇలా కూర్చోండక్కయ్యగారూ," అని తివాసీ చూపెట్టింది. సావిత్రమ్మకు ఇంచుమించు మతిపోయినట్లే అయింది. అందరిముందూ తనని పార్వతమ్మ ఎంతేనా చిన్నబుచ్చుతున్నదనుకుంది. మరొచ్చినతరువాత కూర్చోక తప్పుతుందా?...

"వాయనం త్వరగా ఇచ్చేయండి. ఇంటిదగ్గర బోలెడుపనుంది," అంది సావిత్రమ్మ.

"అలాగే!... ఏదో మీలాంటివారు మాలాంటివారింటికి రావడమే ఓ వేడుక. ఏవో రాకరాక వచ్చేరు. అప్పుడే వెళ్లిపోతానంటే ఎలాగ చెప్పండి? అంది పార్వతమ్మ.

సావిత్రమ్మకు మరింత కోపంవచ్చింది. తనన్నమాటకు సమాధానంకూడానా అని ఆమె ఆగ్రహం! "ఆ! ఎంతమాట... ఇంటిదగ్గర పనుండబట్టిగాని లేకపోతే ఎంతసేపయినా కూర్చొనిఉందును." అని అంటూ తను తెచ్చిన కానుకలను ఆమెచేతి కందించింది అవి చూసి పార్వతమ్మ మురిసిపోతుందనీ, 'ఎక్కడ కొన్నారు? ఎంతకి కొన్నారు?' అని అడుగుతుందనీ అనుకుంది. కానీ అలా ఏమీ జరగలేదు. పట్టుకెళ్లి నట్టింటిలో పెట్టి తిరిగి పళ్లెం తీసుకొస్తూ—

"మీరలా అంటారుగానీ మీలాంటివారికి ఇంటిదగ్గర ఏమి పనుంటుంది చెప్పండి?" అని పళ్లెంఇస్తూ, నవ్వుతూ అంది పార్వతమ్మ.

వంటిమీద తేళ్లు నడిచినట్లయింది సావిత్రమ్మకు. తిరిగి అలాంటి ప్రశ్న వేస్తుందనుకోలేదామె. "ఆc, లేకేం? ఆ వంటవాడికి రాత్రివంట కివ్వవలసిన సామాను లివ్వాలా మరి?" అంది ఎలానో సమర్థించుకుంటూ.





"ఇదుగో, ఇప్పుడే ఇచ్చేస్తాను. నరసమ్మగారు రావడం తడవు పిల్లడిని ఉయ్యాలలో ఉంచి మంగళహారతి ఇచ్చేస్తాను. ఏదో ఆవిడ అనుభవజ్ఞురాలుకదా మరి!!" అంది పార్వతమ్మ.

నరసమ్మలోగల అధిక్యత ఏమిటో బోధపడిందికాదామెకు. వయస్సువిషయంలో మినహాఇస్తే ఏవిషయంలో ఆమె తనకన్నా గొప్పదో అర్థమయిందికాదు సావిత్రమ్మకు పైకేమీ అనలేదు. కానీ మనస్సులో ఎంతేనా కోపం వచ్చింది పార్వతమ్మమీద!... ఎప్పటికయినా తగిన ప్రతిక్రియ చేయాలని సంకల్పించుకుంది. "సరే, వాయనం ఎవరిచేతయినా పంపించేయండి. నేను వెళతా," అంటూ లేవబోయింది సావిత్రమ్మ!...

పార్వతమ్మకు కొంచెం భయంవేసింది. అందరినీ నాలుగుగంటలకు రమ్మనమని చెపుతే, సరిఅయినవేళకు అందరూ ఎందుకు రారని అందరిమీదా కోపంవచ్చిందామెకు. నరసమ్మని తీసుకురమ్మని కొడుకుని పంపించింది. ఒక్క అయిదు నిముషాల సేపు ఆగమని సావిత్రమ్మను బ్రతిమాలుకుంది.

ఒక్క అయిదునిముషాలలోనే గదంతా నిండిపోయింది పేరంటాళ్లతో! ఆఖరికి ఊళ్లోవాళ్లుకూడా తాసిల్దారుగారి భార్య అన్న భావంలేకుండా ఆమెను తాకుతూ నెట్టూకూర్చున్నారు. వాళ్లందరి మధ్యా తనకు ప్రత్యేకత చూపలేదని పార్వతమ్మ నామీద ఎంతేకోపంవచ్చింది. తగినట్లుగా ప్రతిక్రియ చెయ్యాలనుకుంది. గంధం, పారాణిపట్టుకొని గదిలోకివచ్చింది పార్వతమ్మ. తన పాదాలకే ముందు రాస్తుందని పాదాలను ముందుకు జరిపింది. కానీ అలామాత్రం జరగలేదు. ఓ కొసనుంచి ప్రారంభించింది. ఆతరువాత మంగళహారతి ఇవ్వడంవిషయంలోనూ అలాంటి అవమానమే జరిగింది. "మంగళహారతి పాడమని సావిత్రమ్మను కోరింది పార్వతమ్మ!... అందరిమధ్యా, తనకు పాడడం రాదని ఒప్పుకోక తప్పిందికాదు. ఏం చేస్తుంది మరి?... ఇన్ని అవమానాలు జరగడంవల్ల మరి భరించలేకపోయిందామె!...ఆఖరికి వాయనం ఇవ్వడంవిషయంలోనయినా తనకు ప్రాముఖ్యత ఇస్తుందేమో అని ఆశించింది. ఆ ఆశకూడా అంతరించింది. అక్కడున్నవాళ్ళందరిలోకీ వృద్ధురాలయిన నరసమ్మగారికే ముందు వాయనం ఇయ్యబడింది. ఆరోజున ఎంతయినా చిన్నబుచ్చుకుంది సావిత్రమ్మ! ఆఖరున సావిత్రమ్మను దిగబెడుతూ, "ఏదో మీలాంటివారు రావడంవల్ల జయప్రదంగా జరిగింది," అంది పార్వతమ్మ. ఓ శూలంతో పొడిచినట్లనిపించింది సావిత్రమ్మకు.

*    *    *    *

ఏవిధంగానయినా తగిన ప్రతిక్రియ చేద్దామనుకుంది సావిత్రమ్మ. కాని ఏం చెయ్యడం?... ఎలా చెయ్య అనేవే ప్రశ్నలు. ఉన్నవీ, లేనివీ కల్పించి పార్వతమ్మ తనని అవమానపరచిందని భర్తతో చెప్పింది. అంతా విని "పాపం అతను చాలా మంచివాడు. అంత మంచివాడికి అలాంటి భార్య దొరికిందేమిటి?" అన్నారు తాసిల్దారుగారు.

"అతనూ అంతేనండీ! నక్కవినయాలు పైకలా కనిపిస్తాడు కానీ ఎన్నయినా కుళ్లుబుద్ధులున్నాయట!"

"నీకెలా తెలిసింది?" ఆశ్చర్యంతో అడిగేరు తాసిల్దారుగారు.

"మన పొరుగింటావిడ చెప్పింది. లేకపోతే నాకేం తెలుస్తుంది?"

"ఏమని చెప్పింది?"

"ఏమనేమిటి!... ప్రతీరోజూ ఇరుగు పొరుగువాళ్లతో మీమీద లేని పోని మాటలు చెబుతూఉంటాడట!— మీరెందుకూ పనికిరాని చేతకాని తెయ్యాప్పలట! తనే ఆ పనిలోఉంటే ఈపాటికి ఇంటంతటినీ బంగారంతో నింపేసుండునట!—వెధవ పేలాపనా వాడూనూ!" అంది సావిత్రమ్మ.

"ఛీ! ఛీ! అతనలా అన్నాడంటే నే నమ్మను."

"నమ్మరూ?.. నమ్మకపోతే మానేయండి! అక్కడికి మన పొరిగింటావిడ వట్టి అబద్ధాల కోరంటారు... అంతేనా?" అంటూ చరచరా పడకగదిలోకి వెళ్లిపోయింది.

ఈ గొడవంతటినీ చూచేసరికి తాసిల్దారుగారికి తలతిరిగినట్లయింది. ఇంతకీ ఆడవాళ్ల గొడవ తనకెందుకని ఊరుకున్నాడు.

అవమానంమీద అవమానం!... తనమాటమీద ఆఖరికి భర్తకూడా విలువ లేకపోయింది కదా అని ఎంతేనా నొచ్చుకుంది. దానికితోడు ఒకనాడు నరసమ్మ వాళ్లింటికి వెళ్లి మాటలసందర్భంలో...

"ఏదోఉన్నంతమట్టుకు ముద్దూ ముచ్చట జరుపుతుంది పార్వతమ్మ. వయస్సుకు చిన్నదయినా లోకజ్ఞానం తెలిసిన మనిషి. అతగాడు కూడా చాలా మంచివాడేనండి. మొన్న పిల్లడిని ఉయ్యాలలో పెట్టిననాడు ఆఫీసులోవాళ్లందరికీ టీపార్టీ చేసేడట!... తాసీల్దారు మెళ్లో ఓ కర్పూరపుదండ వేసి, ఆయనమీద ఏవోపద్యాలురాసి చదివేడట. ఆతరువాత మీ ఆయన అతగాడికోక పెన్ను బహుమతిగా ఇచ్చేరట," అంది.

"ఆయన సామ్మేంపోయింది? ఇచ్చకపు రాయుళ్లందరూ చుట్టూ చేరి భజన చేస్తూ ఉంటే పొంగిపోతూఉంటారు," అంది సావిత్రమ్మ, చిరాకుతో!

"ఆఁ! ఏదో సరదాకొద్దీనీ," అంది నరసమ్మ.

"వెధవసరదాలు! ఆ ఊసు మరెత్తకండి," అంది సావిత్రమ్మ ఆగ్రహంతో—

ఆవలిస్తే ప్రేవులు లెక్కపెట్టే మనిషి నరసమ్మ; పార్వతమ్మకుటుంబం అంటే

ఎందుకో అసహ్యించుకుంటున్నాదని గ్రహించింది. అక్కడితో ఆ సంభాషణకు ఓ ఫులిస్టాపు పెట్టింది.

తమ హోదాకు, తగిన గౌరవం అవతల వాళ్లు ఇవ్వలేదనేటువంటి చిల్లరవిషయాలకోసం మనస్సులో కుళ్లి, కుళ్లి బాధ పడుతుంటూరు కొందరు. సాగితే ఎంతటి అపకారాన్నయినా అవతల వాళ్లకు చేస్తారు!......

భర్తతో చెప్పి, పార్వతమ్మ భర్త ఉద్యోగాన్ని ఏరకంగానయినా తీయించివేద్దామని అమాయకంగా, అజ్ఞానంతో ఆలోచించింది. ఆఖరికి 'నిరాశ' అని తేలిందా విషయంలో. ఇక ఆమెను అవమానపరచడానికి ఒకటే దారుంది తనూ తన బిడ్డను ఉయ్యాలలో పెట్టవలసేరోజు ముందు ముందొస్తున్నది. తన ఆశయం ఆనాడే నెరవేరాలని అనుకుంది.

తొమ్మిదినెలలూ నిండాయి. పురుడొచ్చింది. ఇరవై ఒకటవరోజున అందరినీ పిలవాలనీ, పార్వతమ్మను నలుగురిమధ్యా అవమానపరచాలనీ ఊహాచిత్రాన్ని గీస్తున్నది!!

కానీ, ప్రత్యేకించి పిలవనవసరం లేకుండానే, అనుకున్న సంఖ్యకన్నా ఎక్కువమందే ఒచ్చేరు పిల్ల చనిపోయినందుకు పరామర్శకని!!

---

## కిందటివారం ప్రశ్నలకి జవాబులు.

1. తనకి అన్నదమ్ములెవ్వరూ లేకపోతే తన తండ్రి కొడుకు తనొక్కడే అవుతాడు. తను ఫోటోలో ఉన్నవాడికి తండ్రి అంటే అర్థం ఆ ఫోటోలోవాడు తన కొడుకన్నమాట. ఆఫోటో తన కొడుకుదే.

2. మొదటి గంట కొట్టిన దగ్గిర్నించీ రామ్మూర్తి గంటలు వినటం మొదలెట్టాడు. 2, 3, 4, 5, 6 గంటలు కొట్టడానికే 30 సెకండ్లుపట్టింది. అంటే ఒక్కొక్క గంట కొట్టడానికి 6 సెకండ్లు పట్టిందన్నమాట 7, 8, 9, 10, 11, 12 గంటలు కొట్టడానికి ఆ రాగ్లు 36 సెకండ్లు పడుతుంది. కనక మొత్తం 12 గంటలు పూర్తయ్యేసరికి 30 + 36. = 66 సెకండ్లు పట్టింది.

3. ఒక్కొక్కళ్లూ ఒక్కొక్క లడ్డూ తీసుకున్నారు. 15 వ పిల్లవాడు కాగితం సంచీతోపాటే లడ్డూ తీసుకున్నాడు. అందుకనే సంచీలో లడ్డూ మిగిలింది.

---

# పరిణామం

(9-వ పేజీ తరువాయి)

రెండో నిమిషాల్లో రాముడి పాటా, బూట్ల చప్పుడున్నూ వినిపించేయ్." మా వదిన సుకుమారీ వదినా-మంగళకర వదినా—'

"ఏడిశావ్. ఊరుకోరా. వాళ్లు వింటే బాగుండదు," అని రహస్యంగా అన్న గోపాలం మాటలూ వాళ్ళకి వినిపించినయ్. ఈ లోపల సంతోషం పైకి కనబడకుండా, సిగ్గు వెలుపలికి రానీయకుండా శేషయ్యపక్కని కూర్చుంటూ "ఎప్పుడు వచ్చావ్ మావయ్యా" అన్నాడు గోపాలం.

"ఇప్పుడే వచ్చానోయ్. అంతా అరగంటవలేదు."

"అంతా కులాసాగా వున్నారా?"

"ఆహాఁ అయితే - అఫీసు వర్కెలా వుంది? సంగతి సందర్భా లేవన్నా చెప్పు మరీ."

"ఆఫీసుమాటే అడిగావు. వాళ్ళకేమన్నా పనా, పాడా? ఇరవైనాలుగు గంటలూ మా చేత పని చేయించుకోటమే వాళ్ల పని; అన్నాడు. లోపల్నుంచి వచ్చిన కామమ్మ గోపాలాన్ని చూసి సంతోషాన్నాపుకోలేక, శేషయ్యతో అనేసింది. "ఇదుగో, నాయనా, మీ అల్లుడే వచ్చాడు. నువ్వూ అతనూ చూసుకోండి" అని చెప్పొద్దూ. వేళ్ళు విరుచుకుంటూ గోపాలం బుర్ర వంచుకుని కూర్చున్నాడు. ఎల్లాగయినా పెళ్ళంటే కాస్త సిగ్గేగా.

"ఏద్రా, మా కోడ లేదీ, అంటూ కామమ్మ శూన్యమైన వంటింటి గడపవేపు చూసింది."

"అయ్యో దీని సిగ్గు యిదైపోనూ," అని లక్ష్మమ్మ లేచి సీతని వెదుకుతూ, ఎక్కడా కనిపించక చివరికి జాజిపందిరికున్న ఆకులన్నీ తుంపుతూ కూర్చున్న సీతని చూసింది.

"అదేమిటే మరీని! అతను కూడా వచ్చాడు. వెళ్ళి చూసుకో!" అంది. సీత రహస్యంగా "అబ్బ! వుండవే, నువ్వు మరీని సిగ్గైనా లేకుండాను" అంది బుంగమూతి పెడుతూ.

"ఇది మరీ బాగుందమ్మా, మధ్యన్నా కెందుకూ సిగ్గు. కందకి లేని దురద బచ్చలికా? రా-రా," అన్నదే కాని ఎంతైనా సీతని అక్కణ్ణించి కదిల్పించ లేకపోయింది.

'పోనీలేవే. దానంత టదే చూసుకుంటుంది వాళ్ల బావని, నువురా. "బుజాలెగరేసి గెడ్డం వెడల్పుచేస్తూ, శేషయ్య అన్నాడు. లక్ష్మమ్మ వచ్చి కూర్చుంది. "బట్టలు మార్చుకొస్తా, మావయ్యా," అని నవ్వు నాపుకుంటూ లోపలికి వచ్చేశాడు గోపాలం.

ప్రతిమనిషికీ తానువైవాహికజీవితంలో ప్రవేశిస్తున్నప్పుడు ఆరాటం, ఆత్రుతా, ఏమేమో భావాలు కలుగుతై. ఆ మధురానుభూతి యెన్నడా అని అంచనాలమీద నిచ్చెన్లు వేస్తూ, భవిష్యత్తులో కలలుకంటూ భవితవ్యానికి వలలు వేస్తూ వుంటాడు. గోపాలంగూడా మానవమాత్రుడే గాబట్టి ఆ పని చేయకుండా మరి వుండలేకపోయాడు.

"ఒరే రాముడూ, ఎల్లా గుంటుందిరా పిల్ల?" ఎంతో ఆత్రంగా రహస్యంగా అడిగాడు గోపాలం.

"చాలా బాగుంటుందిరా. సరిగ్గా నీకు సరిపోతుందిలే. అయితే నీకంటే బాగా తెలుపు."

"ఏడిశావ్, అయితే నేను నలుపంటావేమిటే?"

"లేకపోతే బంగారంపసిమిలా వున్నాననుకున్నావా?"

గోపాలానికి కోపం గుండెలదాకావచ్చి ఆగిపోయి అక్కణ్ణించి అది ఉక్రోషంగా మారింది. ఆ ఉక్రోషం అతని చేత అనిపించిన మాట యేమిటంటే, 'ఏం తెలుపు కాక? నాకంటే తెల్లగా వుంటే నాకా పిల్ల అసలు వద్దనే వద్దు,' అని.

"అదేమిట్రోయ్? అందరూ తెల్లపిల్లనే పెళ్ళాడ్డానికి సంబరపడుతూవుంటే నీకు నల్లపిల్లయితేనే కావాలట్రా?"

"అసలు నాకు నల్లపిలలంటేనే యిష్టం. చెప్పేస్తాను శేషయ్యతో. మీ పిల్ల నల్లగా వుంటేనే నాకు కావాలని," అన్నాడు మెల్లిగా.

"అయితే నేనే చెప్పేసివస్తాను", అంటూ నడవాకేసి నడిచాడు రాముడు.

"ఒరేయ్ కొంపతీశావ్. ఇల్లా రారా, బాబూ" మూతిమీద నాలుగు వేళ్లూ పెట్టి రహస్యంగా మరీ అన్నాడు గోపాలం.

"ఏం మటి? ఇష్టంలేని పిల్లని పెళ్ళిచేసుకొని బ్రతికున్నాళ్లూ కష్టపడేదానికంటే యిష్టంలేదని కచ్చితంగా చెప్పేస్తైనే మంచిదిగా" అన్నాడు కొంటెగా రాముడు.

"ఏడిశావ్. యిట్రా," సంతోషం నవ్వు, సిగ్గు మిళితమై యీ మాట గోపాలం నోటినుంచి వెలువడింది.

"ఒరేయ్! అమ్మ నోమాటు యిలా పిలు"

ఈ మాట కామమ్మకి వినిపించి, తనే వచ్చింది. "ఏంరా నాయనా?"

"అది కాదమ్మా" అన్నాడే కాని, అసలెందుకు పిల్చాడో మర్చిపోయాడు గోపాలం. ఓ మూలనుంచి సంతోషం, మరోమూలనుంచి సిగ్గూ, పొడుచుకు పొడుచుకు వస్తున్నై. ఈ రెంటినీ పెదిమల వెనకనే అదిమిపట్టి యేదో మాట్లాడబోతాడు. పెదిమలు మెదిపితే ఈ రెండూ వూడిపడతయ్యని గోపాలానికి భయం.

"నాదగ్గఱ సిగ్గెందుకూ? ఉన్నమాటేదో అడుగూ" అని కొడుకు భావాన్ని ముందే అవగాహన చేసుకుని అభయహస్తం యిచ్చినమీదట గోపాలం ధైర్యం తెచ్చుకున్నాడు. తెచ్చుకున్నవాడు ఆపళాన వుండచ్చా, "ఏమన్నా చదువుకుందిట్నా? సంగీతం యేమన్నా వచ్చా? అసలు ముందు నీకు నచ్చిందా? హిందీ నేర్పిస్తే బాగుంటుంది కదూ?" అని పడపడా అడిగేసి భావికి నిచ్చెనలు కూడా వేశేసేడు.

"నాకు నచ్చడం జోలి నీ కెందుకూ? ముందు నీకు నచ్చిందా, లేదా?" అంది కామమ్మ.

సర్లే. ఆ మాట రాము ణ్ణడుగు. నే నడిగిందానికి సమాధానం చెప్పు," అన్నాడు ఓ మాదిరి అధికారంతో కామమ్మ కాబోయే కోడలి "క్వాలిఫికేషన్సు" ఏకరు పెట్టింది.

"చక్కగా హార్మణీ వాయిస్తుందిట. తరుడు ఖారందాకా చదువుకొందిట. హిందీలో ప్రాథమికపరీక్ష ప్యాసయిందట. ఇంకా యేం కావాలి?"

"బస్, యింతేనా?" అన్నాడు చప్పగా పెదిమలు విరుస్తూ, మెచ్చుకుంటే తన ప్రతిష్ఠకి భంగం అనే వుద్దేశ్యంతో. నిజానికి - తనకీ తెలుసు - అంతకంటే అవసరం లేదని, అదే కోకొల్లలనీనీ. అయితే పైకి మాత్రం అలా అనలేదు. ఇక తను మాట్లాడకుండా, 'రాముడూ,' అని పిల్చి అవతలికి వెళ్ళిపోయేడు. కామమ్మగూడా సంతోషంతో బరువెక్కిన గుండె నదుము కొంటూ శేషయ్యా, లక్ష్మమ్మా వున్న నడవావైపు వెళ్లింది.

*    *    *    *

చూస్తుండగా కేలండర్‌లో తొంభై కాగితాలు చిరిగినై. సీత కాపరాని కొచ్చింది. వస్తూనే ఆ యింట్లో యజమానురాలి స్థానం ఆక్రమించుకొంది. మొదట్లో గోపాలాన్ని చూసి చాలా బుద్ధిమంతు డనుకొంది. కాని యింత అల్లరి వాడనుకోలేదు. అసలు అల్లరివాడు కాదేమో నని బెంగపెట్టుకుంది గూడాను. రాను రాను సీతగూడా మహా చెడ్డ అల్లరి పిల్లలా మారిపోయింది. ఇంట్లో కూర్చుని సీతా, తనూ, రాముడూ కలసి అల్లరి చేయటమే యిప్పటి గోపాలం పరమావధి. బుంగమూతి పెట్టి అలకపట్టే సీతని తన రెండుచేతులే "సెన్నడుముపై, కటిపై, గళంబుపై, జడపై" ఆనించి అలక తీర్చటమే అతని నిర్విరామమైన ఆఫీసువర్కు, సిగ్గుచేత మొహంమీద చెప్పలేని మాటలు కాగితంమీద వ్రాసి తన కిస్తే - ఒకటికి నాలుగుసార్లు చదువుకొని వాటికి సమాధానాలు వ్రాయటమే అతని ఆఫీసు ఫయిల్సు గోపాలాన్ని వదిలి సీతా - సీతని వదిలి గోపాలమూ వుండలేని పరిస్థితు లేర్పడ్డా యిప్పుడు. వీళ్లిద్దరికీ జత రాముడు. ముగ్గురూ కలిస్తే యిహ మరి చెప్పనక్కర్లేదు.

## 3

"కాలపరిణామంతోపాటు మానవదేహాల్లోనూ, హృదయాల్లోనూ కూడా పరిణామాలు వస్తయ్. హృదయమే మూలంగా వున్న ప్రేమకి దేహంగాని, భౌతికస్వరూపాలు గాని, భౌతికపరిణామాలుగాని అనవసరం. దైహికావసరాలు తీరే పరిసరాల దాకా కామానికికూడా ప్రేమకి చెప్పే నిర్వచనమే చేస్తారు. ఆతర్వాత అది కామం అనీ, నీచపు ప్రవృత్తి అనీ కబుర్లు చెప్తారు. అదే మానవనైజం"

గడచిన మూడు సంవత్సరాల్లోనూ సీత 'తల్లి' అయింది. అందరూ కలసి పాపాయిని 'బుజ్జి' అని ముద్దుపేరుతో పిలుస్తున్నారు. రాముడుకూడా యిప్పుడు ప్రేమకి నిర్వచనాలు చెప్పేంతటివా డయ్యాడు.

గోపాలం ఒక రోజున 'ఖంగు' మని దగ్గాడు. ఆ దగ్గు యెందుకో కామమ్మలో కంపాన్ని రేకెత్తించింది. గోపాలం ఆ రోజు కేమీ లెఖ్ఖచెయ్యలేదు. మర్నాడు మరీ గట్టిగా దగ్గేడు. ఆ దగ్గు తర్వాత వేసిన కళ్ళెలో రక్తపు జీరలు కనిపించినయ్. ఆ తర్వాత తన పరిస్థితి అర్థంచేసుకోగలిగాడు. తను కాని కామమ్మతో చెప్పలేదు. చెప్పకపోయినప్పటికీ గోపాలం ముఖ కవళికల్ని బట్టి గ్రహించుకుంది మాతృహృదయం. ఒక రోజున గోపాలం ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతని కంటివెంబడి అశ్రుబిందువులు యేకధారగా స్రవిస్తున్నయ్. ఇక తన చిట్టి 'బుజ్జి'గతేమిటి? అమాయకురాలు తన్నంతగా ప్రేమిస్తున్న సీతగతేమిటి? తను లేకపోతే అది ఒక్కక్షణం బ్రతకలేదే అల్లాంటిది తనని శాశ్వతంగా వదిలిపెట్టే పరిస్థితివస్తుందేమో. ఈఆలోచన ప్రవేశించే సరికి అతనికి పూర్తిగా మతి చెడిపోయింది. మృత్యుదేవత తన యెదురుగా నుంచుని వికటాట్టహాసంచేస్తూ, వాడిగా వున్న గోళ్లు చూపిస్తూ, చేతులు భయంకరంగా తిప్పుతూ తనమీదికే వస్తూన్నట్లు కనిపించిం దతనికి. వెంటనే భయంతో కేకేశాడు, "బుజ్జీ! సీతా! అమ్మా! అని ఖంగారుగా. గాభరాగా అందరూ పరుగెత్తుకొచ్చారక్కడికి. బుజ్జి ఒళ్లో కూర్చోబోయింది. "వెళ్లు తల్లీ! వెళ్లిపో, అమ్మదగ్గిరే వుండు. ఇంక నా దగ్గరికి రాకు" అని దింపేశాడు. సీత దగ్గరగా రాబోయింది. "వెళ్లు, సీతా, ఇవ్వాళనుంచి నాదగ్గిరికి రాకు. దూరంగా వుండు." అన్నాడు. సీత బిత్తరపోయింది. ప్రాణం లేనిదానిలా అయిపోయింది. "అదేమిటండీ మీ రీ లోకంలోనే వుండి మాట్లాడుతున్నారా?" అంది సీత అమాయకంగా. తన మృత్యువు నూహించుకుంటూ ఆవేపే చూస్తున్న గోపాలం దృష్టి మరల్చకుండా మళ్లీ అన్నాడు. ఆఁ. ఇవాల్టి కీలోకంలోనే వున్నాను. రేపుమాత్రం యీ లోకంలో వుంటానని నిశ్చయమేమిటి?" ఈమాట వినంగానే సీతగొంతు గాద్గదిక మయింది.

"ఏమిటీ మీరంతా యివ్వాళ యిల్లా మాట్లాడుతున్నారు. దేన్నలా తేరిగా చూస్తున్నారు? నా కేసి ఒక్కసారి చూడండి. నేను - మీ సీతని."

సీతకి యేడుపు ఆగటంలేదు. అత నల్లా చూస్తూనే అన్నాడు. "అవును. నాకు తెలుసు. నువ్వు చెప్పక్కర్లేదు. నువ్వు సీతవనీ తెలుసు, రేపటికి నువ్వు 'పూర్వసువాసి"నని పిలవబడతావనీ తెలుసు. బుజ్జి

తండ్రిలేని పిల్ల అవుతుందనికూడా తెలుసు అన్నాడు వెక్కిగా.

అంతా చూస్తూ కామమ్మ కంటికీ, మంటికీ యేకధారగా యేడవటంతప్ప యేం చేయలేకపోయింది. అలాగే కొయ్యబారినట్లయిపోయింది. సీత యేడుస్తూ అతని దగ్గరగా వచ్చి నుంచుంది.

దాంతో గోపాలం ఒక్క వెర్రికేక వేశాడు. 'ఏయ్! సీతా. నీక్కాదూ చెపుతూంట, నా దగ్గిరగా రాకు దూరంగా ఫో."

ఈ అరుపుతో సీత బిక్క చచ్చిపోయింది. కామమ్మగూడా సంజ్ఞ చేయడం చేత ఒక్క క్షణం అక్క డుండకుండా బుజ్జిని చంక నేసుకుని ప్రక్కగదిలోకి వెళ్లిపోయింది యేడుస్తూనే. కామమ్మ గోపాలాని కెదురుగా నుంచుంది.

గోపాలం తల్లితో అన్నాడు, "అమ్మా. సీత నీ కోడలు! బుజ్జి నీ మనమరాలు. వీళ్ళని యెలా చూసుకోవాలో నేను చెప్ప నక్కర్లేదు"

కామమ్మ యింక వినలేకపోయింది. రెండు చేతుల్తోనూ గోపాలంనోరు మూసేసింది. గోపాలం యింక ఉండబట్టలేక అమ్మని గట్టిగా కవుగలించుకుని బావురుమన్నాడు చంటిపిల్లాడిలా. కామమ్మ కళ్లు యేకధారగా వర్షించినయ్. గోపాలం వళ్లు కాగిపోతోంది. ఆ గదిలోనే మంచంమీద పడుకోబెట్టింది గోపాలాన్ని. అమ్మని దగ్గరసా పిల్చాడు.

'అమ్మా! సీతని కేకలేశాను. కోప్పడ్డాను. అది యేడుస్తూ పోయింది. కోపం చేత అల్లా చేశా ననుకుంటుం దది. నువ్వు దాని కోప్పం రాకుండా చేస్తావా, అమ్మా?' "అన్నాడు బరువెక్కిన హృదయంతో" అల్లా గేనాయనా, సీత వట్టి అమాయకురాలు. కోపమంటే యేమిటో యెరగని ముగ్ధ. దానికి కోపం రాదు. అయినా నేను చెపుతాలే."

"నిజమేనమ్మా, దానికి కోపం రాదే. అది యెప్పుడూ మనసా నన్ను ప్రేమిస్తూండే. అమ్మా! అది ముద్దరాలమ్మా, ఇంకది యెల్లా బతుకుతుందే?" మళ్లీ గట్టిగా యేడ్చాడు గోపాలం.

"ఏడవకురా, బాబూ! అది చిన్నపిల్ల- అసలే భయస్తురాలు, గాభరాపడిపోతుంది. ఏడవకు. మళ్లీ దగ్గు యెక్కు వవుతుందిరా నాన్నా" అని కామమ్మ యెంతో బతిమాలింతర్వాత గోపాలం గుండెలు చిక్కబట్టుకొన్నాడు. ఒక్కసారి అమానుషమైన దగ్గు వొచ్చి మనిషిని పీనుగను చేసి చారెడేసి రక్తాన్ని కక్కిస్తూంది. సీతకి పరిస్థితులన్నీ పూర్తిగా అవగాహన అయినై. ఆమెలో భయం అంతరించింది. బుజ్జినిమాత్రం దూరంగా వుంచి తనే స్వయంగా సేవ చెయ్యటం మొదలుపెట్టింది గోపాలానికి. డాక్టరు సీతని దగ్గరగా రావద్దన్నాడు. ఆతర్వాత కామమ్మే అంతా చూసుకుంటూ, రాముణ్ణీ, సీతనీకూడా దగ్గరగా రానియ్యటంలేదు. బుజ్జిని మేడ మీంచి కిందికసలు దింపడం లేదు.

ఒక రోజున కామమ్మ సీతతో అంది: "ఇదుగో, అమ్మాయ్, అనవసరంగా మన స్సులో యేమీ బాధ పెట్టుకోవద్దు. అబ్బాయి కొచ్చిన ఫరవా యేమిన్నీ లేదు. వాడి సంగతి నేను చూసుకుంటాను. నువ్వు మాత్రం కిందికి దిగిరాకు, కావలిస్తే మన శాంతికోసం నువ్వూ రాముడూ పైన చీట్లాట ఆడుకోండి. అవసరమైనంత పనొస్తేనేగాని కిందికి దిగిరావద్దు." అని హెచ్చరించింది ఆతర్వాత రాముడితో గూడా చెప్పింది. "ఒరేయ్. ఒదిన కష్టమానం ధైర్యం చెపుతూండు. అది వట్టి పిరికి మనిషి. బుజ్జీ, నువ్వూ, వదినా అవసరమైనంత పని ఒస్తే నేగాని మేడ దిగొద్దు. ఒదిన జాగర్త. అని సగం బాధ్యత రాముడిమీద పెట్టిం దావిడ. రోజూ డాక్టర్లొస్తున్నారు, పోతున్నారు. గోపాలం ఆరోగ్యంలో మార్పేమీ లేదు. సీతా, బుజ్జీ, రాముడూ యెవళ్లూ మేడ దిగటంలేదు. మొదట్లో సీత యెంతో కుమిలి కుమిలి యేడ్చేది గోపాలం కోసం. భగవంతుణ్ణి యెన్నో విధాలుగా ప్రార్థించేది. తర్వాత్తర్వాత రాముడి బోధనలవల్ల, పేకముక్కలవల్ల సీత యిప్పుడు విచారాన్ని పూర్తిగా మరిచిపోగలుగుతోంది. ఇప్పుడు రాముడి మాటల్లోనూ, కళావరాసులలోనూ మునిగిపోయింది సీత.

## 4

ఆ రోజున గోపాలం గొంతు బద్దలయేలా వస్తూంది దగ్గు. కామమ్మ కళ్ళల్లో నిరాశ ప్రతిబింబిస్తూంది. డాక్టర్ గంట గంటకి యింజక్షన్లు యిస్తున్నాడు. మరో గంటలోపల వస్తాను. అబ్బాయిని జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూవుండండి. అని డాక్టరుగారు వెళ్లిపోయారు. గోపాలంకళ్లు తెరిచాడు. 'అమ్మా' అనగలిగాడు అతికష్టంమీద.

'ఏం నాన్నా' అంది నిద్రెరుగని తల్లి గుండె.

"సీత నోమాటు పిలుస్తావా"

"ఎందుకు నాయనా యిప్పుడు? పైన నిద్రోతోంది. నిద్రపోనీ. పన్నెండుగంటల వేళ పిలుస్తే బేజారు పడుతుంది."

"ఓమాటు చూడాలనుందే. బుజ్జి ఖులాసాగా ఆడుకుంటూందా?"

"ఆఁ. అంతా బాగున్నారు. నువ్వు కళ్లు మూసుకు పడుకో"

"ఊఁ. శాశ్వతంగా కళ్లుమూసుకుపడుకుంటాలే. ఒక్కసారి సీతని పిలువు"

ఈమాటు పిలవక తప్పింది కాదు. 'సీతా' అని కిందిమెట్టుదగ్గిర్నుంచే పిలిచింది కామమ్మ. "ఏమత్తయ్యా" అని పైనుంచే జవాబు.

"అన్నాయోమాటు రమ్మంటున్నాడు."

"ఇప్పుడు వీల్లే దత్తయ్యా. ఆట మంచి పట్టులో వుంది."

కామమ్మ ఆశ్చర్యపోయింది. అర్ధరాత్రి వేళ గూడా ఆట లేమిట్రా, పడుకోకుండానూ? ఒక్కమాట్కొచ్చి వెళ్లు, అబ్బాయి కలవరిస్తున్నాడు."అని గోపాలం వున్న గదిలోకెళ్ళింది.

"అబ్బబ్బ! చచ్చేవాళ్లు ఒక్కమాటు చావకూడదూ! బతికున్నవాళ్లని గూడా చంపడం యెందుకో!" విసుక్కుంటూ అతి చికాకుతో మేడమెట్లు దిగింది ఈమాటలు గోపాలంచెవిని పడినయ్. "అవును, హాయిగా చచ్చిపోతాను నా మూలాన్ని మీ అందరికీ బాధెందుకూ" అనుకున్నాడు గోపాలం మనస్సులోనే. సీత గది గుమ్మంలో నుంచుంది.

"సీతా! బుజ్జి ఆడుకుంటూందా?"

"ఆఁ. హాయిగా - ఖులాసాగా ఆడుకుంటూంది. ఇప్పుడు దానిమాటెందుకు? కళ్లు మూసుకు పడుకోండి." ఈ ముక్క సీతనోటంట రాగానే కామమ్మ నిర్జీవ ప్రతిమల్లా అయిపోయింది.

ఇంతలో పైమెట్టునుంచి రాముడు కేకేశాడు. "వదినా! చప్పున రావాలి. నీ రాణిబంతిని రాజు బంతేసి పట్టుకున్నా. చూసుకో!" అని గట్టిగా అరిచాడు.

ఇక అక్కడ ఒక్క క్షణం వుండకుండా వెళ్ళిపోయింది సీత. కామమ్మ మొహాన్ని కత్తివాటుకి నెత్తురుచుక్క లేదు.

గోపాలం అన్నాడు: "అమ్మా, వాడు రాముడూ - అది సీతాను. వాడు రాజు బంతేసి దాని రాణిబంతిని పట్టుకున్నాడు. ఆట కట్టడిపోయింది. అమ్మా, అది సీతే - వాడు రాముడు - రాముడేనమ్మా. రాణిబంతీ... రాజుబంతీ..." అంటుండగానే గోపాలం గొంతుని బ్రద్దలుచేసుకొని ఆ యిల్లు మారుమోగిపోయేలాగ ఉరుములాటి దగ్గు రావటమూ, ఆ దగ్గువెనకాలే, దోసిళ్లతో పోసినట్టు రక్తం నేలమీద పడిపోవటమూ ఒకసారే జరిగినయ్. మేడమీంచి వస్తూన్న కిలకిలల్లో కామమ్మ 'కెవ్వు'మని అరిచిన అరుపు యెవ్వరికీ వినపడలేదు.

———




కథలకామయ్య:

# చందమామ

ఒక రోజున సాయంత్రం మా డాబామీద కూర్చుని కథల కామయ్య చెప్పే కథలు వింటున్నాము. అప్పాళ పూర్ణిమ. చంద్రుడు తెల్లపువ్వులాగా వెన్నెల కాస్తున్నాడు. అప్పుడప్పుడు నల్లమబ్బుల్లోకి పోయి తెల్లమబ్బులతో దాగుడుమూతలాడుతున్నాడు.

మా చెల్లాయి కథల కామయ్యని అడిగింది. "కామయ్యా, కామయ్యా! చందమామ పేరు చంద్రుడు గదా. చందమామ అని పేరెందుకు వచ్చిందీ?" అని.

కథల కామయ్య కాస్సేపు ఆలోచించి ఇల్లాగన్నాడు. "పూర్వం దేవతలూ, రాక్షసులూ కలిసి అమృతం కోసం పాల సముద్రం చిలికిన కథ నీకు తెలుసా బుల్లెమ్మా!"

"ఓ, తెలియకేం; మా పాఠం పుస్తకంలో ఆ కథ నేను చదివాగా." అంది మా చెల్లాయి.

"అప్పు డేం జరిగిందంటే పాల సముద్రంలోంచి లక్ష్మీదేవి పుట్టుకొచ్చింది. లక్ష్మి తరవాత చంద్రుడు పుట్టాడు. అంటే లక్ష్మి

మధుశ్రీ

దేనికి చంద్రుడు తమ్ము డవుతాడన్న మాట. మీ అమ్మగారు లక్ష్మీదేవితో సమానం గదా. అప్పుడు మీ అమ్మగారి తమ్ముడు చంద్రుడు మీకేమవుతాడు? మేనమామ అవుతాడు. అందుకనే చిన్నపిల్లలంతా చంద్రుడిని 'చందమామా!' అని పిలుస్తారు. తెలిసిందా?" అన్నాడు కామయ్య.

"ఓర్నీ, బలేగా వుందే యీ కథ. అన్నది" చెల్లాయి.

మళ్లీ కామయ్య ఒక కట్టు కథ చెప్పాడు.

"ఒక రోజున చందమామ భూలోకానికి వచ్చాడు. భూలోకమంతా తిరిగి వింతలు, విశేషాలు అన్నీ చూశాడు. పిల్లలందరూ ఆయన మేనల్లుళ్లూ, మేనకోడళ్లేగా. వాళ్లందరూ నిద్రపోతున్న సమయంలో అందరినీ చూసి కులాసాగానే వున్నారు గదా అనుకున్నాడు. చివరికి మళ్లీ తన లోకానికి వెళ్లిపోయేవేళకి ఒకళ్ల యింట్లో చాలా అందమైన అమ్మాయి నిద్రపోతూ కనిపించింది. వెన్నెల్లో ధగధగ మెరిసిపోతున్న ఆ పిల్ల అందం చూడగానే చందమామకు అనుమానం వేసింది. ఆ అమ్మాయి మనుష్యుల పిల్లా, దేవతల పిల్లా అని.

దేవతల వళ్లు బంగారపు వళ్లు. మనుషుల వళ్లు ఎంత బంగారపు రంగులో వున్నా బంగారం కాదుగా. అందుకని చందమామ దగ్గిరికి వెళ్లి చూశాడు, ఆ పిల్ల వళ్లు బంగారమో, కాదో చూద్దా

(35-వ పేజీ చూడుము)






యస్. వి. జోగారావు

పూర్వం అంగరాజ్యాన్ని భాగశుంగ మహారాజు పాలిస్తూవుండేవాడు. అతని మంత్రి చిత్తశుద్ధి. వారిద్దరి పరిపాలనలో దేశం సుభిక్షంగా వుండేది. కాని కళింగదేశపు రాజు ధూమకేతు వారికి గర్భశత్రువు. ఒకసారి ధూమకేతు హఠాత్తుగా యుద్ధం ప్రకటించి అర్ధరాత్రి వేళ భాగశుంగునిమీద దాడిచేశాడు. గుడారాలకి నిప్పంటించి నిద్రపోతున్న సిపాయిలను చంపి, సర్వనాశనం చేశాడు. ఆ యుద్ధంలో భాగశుంగుడూ, చిత్తశుద్ధీ యిద్దరూ మరణించారు. ఈ సంగతి తెలిసి రాణులు చితి పేర్చుకుని సహగమనం చేశారు. ధూమకేతు రాజపుత్రునికోసం వెదికించాడు. కాని రాజకుమారుడు మంత్రికుమారుడైన కార్యసిద్ధితో కలిసి ఒక సొరంగ మార్గంద్వారా కోట దాటి రెండు పంచకల్యాణిగుర్రాల మీద దూరంగా పారిపోయారు.

ఇద్దరూ మజిలీలు చేసుకుంటూ మణిపురం, ప్రాగ్జ్యోతిషం దాటి మహేంద్రనగరం చేరుకున్నారు. మారువేషాలతో పట్నంలో ప్రవేశించారు. అక్కడ ఒక సత్రపు వుంటే అందులో బస చేశారు. పగల్లా వూరూ, వాడా తిరిగి రాత్రి సత్రపులో భోంచేసి ఊరిలోని వింతలూ, విశేషాలూ ముచ్చటించుకుంటూ వుండేవారు.

ఒకనాడు రాజకుమారు ప్రమోదుడు తనొక ఉద్యానవనంలో రహస్యంగా ప్రవేశించినట్లూ, అక్కడ అప్సరసలాంటి అందగత్తెను చూసి మోహించినట్లూ చెప్పి, ఎలాగైనా యెప్పటి



కైనా ఆమెను అంగరాజ్య సింహాసనంమీద తన ప్రక్క పట్టపు రాణిగాకూడా పెట్టుకోవాలని వుందన్నాడు కార్యసిద్ధితో. సిద్ధి చిఱునవ్వు నవ్వి ఇల్లా చెప్పాడు.

"ఆమె మహేంద్రనగర రాజపుత్రి. ఆమె పుట్టినప్పుడే మెడలో ప్రభానమణి అనే ఒక మణితో పుట్టింది. ఆ మణి యెప్పుడూ ఆ పిల్ల మెడలోనే వుండాలి. అది పోతే పోయిన ఒక యేడాదికి ఆమె చనిపోతుందని శాపం ఉన్నదని ఒక మునీశ్వరుడు చెప్పాడు. రెండు రోజుల క్రిందట ఆమె స్నానం చేసేముందు ఆభరణాలు తీసివేస్తూ వుండగా ఒక రామచిలక ఎక్కడనుంచో వచ్చి ఆ మణి ఎత్తుకుపోయిందట. ఆ చిలకకి బంగారపు రెక్కలూ, వజ్రపు ముక్కూ వున్నాయట! ఎవరేనా ఏడాదిలోగా ఆ మణిని సంపాదించి రాజుగారి కిస్తే అర్ధరాజ్య మిస్తారట. ఆ రాకుమార్తె పేరే స్వయంప్రభాదేవి. నీవు చూసింది."

ప్రమోదుడూ, కార్యసిద్ధీ మణి కోసం వెదకడానికి చెరో దేశం తిరగడానికి నిశ్చయించుకున్నారు. ఆవేళకి సరిగా ఆరునెల్లకు మళ్లా సత్రపుదగ్గరకి వచ్చి కలుసుకోవాలని నియమంపెట్టుకున్నారు. కార్యసిద్ధి ప్రమోదణ్ణి అంగరాజ్యానికి మాత్రం పోవద్దని హెచ్చరించి తను కళింగదేశయాత్రకి బయలుదేరాడు. అక్కడ అతను తెలుసుకున్న విశేషాలు ఏమిటంటే ధూమకేతురాజు చనిపోయాడట. అతనికి కొడుకులు లేరు. ఒక్క కూతురు వుంది. ఆమెనే అంగరాజ్యంలోని ప్రాగ్జ్యోతిషపురం రాజధాని చేసుకొని అంగ కళింగదేశాలు రెంటినీ పాలిస్తోందట.

ఆరునెలలు అయిపోయింది. కార్యసిద్ధి మహేంద్రనగరం సత్రపు చేరుకున్నాడు. ఎక్కడా ప్రమోదుని జాడ లేదు. రెండు మూడు రోజు లక్కడే కనిపెట్టుకుని కూచున్నాడు. కాని ప్రమోదుడు రాకపోయేసరికి కార్యసిద్ధికి ఆత్రుత యెక్కువైంది. వెంటనే తను అంగరాజ్యానికి బయల్దేరాడు. సరాసరి నాలుగురోజులకి ప్రాగ్జ్యోతిష పురం చేరుకున్నాడు. ఊరిబయట ఒక పాలరాతిపలకమీద ఒక ప్రకటన చెక్కబడివుంది. "శ్రీవిద్యున్మాల మహారాణిని యెవరైతే చదరంగంలో ఓడిస్తారో, వారినామె వివాహం చేసుకుంటుంది. ఓడిస్తామని వచ్చి ఓడిపోతే వాళ్లకి ఉరిశిక్ష విధించబడుతుంది."

అక్కడే వున్న మఱ్ఱిమాను దగ్గర కొన్ని మనిషి పుఱ్ఱెలు కనిపించాయి. ఊడలకి కొత్తగా ఉరితీయబడ్డ శిరస్సులు వ్రేలాడుతున్నాయి. కార్యసిద్ధి శిరస్సులవేపు పరీక్షగా చూశాడు. అందులో ప్రమోదకుమారుని శిరస్సు లేదు. బ్రతుకు జీవుడా అనుకొని పట్టణం వేపు గుఱ్ఱాన్ని తోలాడు.

కార్యసిద్ధికూడా చదరంగంలో మొనగాడు. విద్యున్మాలతో పందెం వేసినట్లుగా కబురంపించాడు. ఆమె అంగీకరించింది. ఇద్దరూ ఆటకి కూచున్నారు. ఇద్దరికీ మధ్య పలచని తెర కట్టబడివుంది. విద్యున్మాలది మొదటి యెత్తు. ఆమె తెరలోనుంచి చెయి జాచి పావులు జరపబోతూ వుండగా కార్యసిద్ధి తన చేయి తగిలించాడామె చేయికి. ఆమె గుబాలున మొగం ఒక్కసారి పైకెత్తి కార్యసిద్ధిని చూసి, అతని అందానికి ఆశ్చర్యపోయింది. కార్యసిద్ధి సంగనాచిలా కూచున్నాడు. ఆమె తనదే పొరపాటనుకుని నిజంగా ఒక పొరపాటు చేసింది. తప్పుడెత్తు వేసింది. కార్యసిద్ధి బలే మంచి సమయం అనుకుని ఒక గొప్ప యెత్తు వేశాడు. మళ్లా తనవరస వచ్చేసరికిది విద్యున్మాల ఏనుగుని కాజేడు. ఆమె దిగులుగా పావులు జరుపుతోంది. ఇంతలో కార్యసిద్ధి త్రోసి రాజు, ఆటకట్టూ అన్నాడు. విద్యున్మాల సిగ్గుతో లేచిపోయింది.

విద్యున్మాలకూ, కార్యసిద్ధికీ పెళ్లి అయిపోయింది. ఆనాటి రాత్రి పడకగది దగ్గర ఒక బంగారు పంజరం, అందులో బంగారపు రెక్కలు, వజ్రపు ముక్కు గల రామచిలుక చూశాడు కార్యసిద్ధి. "ఓహో! ఇక్కడ వుందా ఈ చిలక. ప్రభానమణికూడా ఇక్కడే వుంటుంది." అనుకున్నాడు. మర్నాటిపొద్దున కార్యసిద్ధి రాజవీధివేపు చూస్తుండగా బాజాభజంత్రీలతో పోతున్న ఒక బండీ కనిపించింది. అందులో పది పదిహేనుమంది రాజకుమారులు వున్నారు. కార్యసిద్ధి వారివేపే చూస్తున్నాడు. ఇంతలో ఒక భటుడువచ్చి మహారాణీవారు దయచేయమంటున్నారని విన్నవించాడు. వెంటనే కార్యసిద్ధిపాగా, కత్తీ తీసుకుని మేడమెట్లు దిగాడు. అక్కడ జోడుగుఱ్ఱాలు వున్నాయి. ఒకదానిమీద విద్యున్మాల మగ

వేషంలో కూచుని వుంది. రెండో గుఱ్ఱం అతనికోసం. ఇరువురూ ఊరిబైటకు చేరుకున్నారు. అక్కడ యిందాక తను చూసిన బండీలోని రాజకుమారులు కాళ్లూ, చేతులూ కట్టబడి వరసగా కూచుని వున్నారు. తలారులు కత్తులు నూరుతున్నారు. కార్యసిద్ధి, గుఱ్ఱం దిగుతూ "ఏమిటీ ఘోరం?" అని అడిగాడు విద్యున్మాలను. రాజకుమారులందరూ తల యెత్తి చూశారు కార్యసిద్ధివంక. అందులో ఒకడు యేడుపు మొదలెట్టాడు. కార్యసిద్ధి అతన్ని సైగ చేసి ఊరుకోమన్నాడు. విద్యున్మాల నవ్వుతూ "వీరు చదరంగంలో నన్ను గెలిచి అంగరాజుల మైపోదామని వచ్చిన ప్రబుద్ధులు" అన్నది. కార్యసిద్ధి గంభీరంగా యీ వధ జరగడానికి వీల్లేదన్నాడు. "జరిగి తీరా"లంది విద్యున్మాల. "నీకు నామీద ప్రేమ, ప్రాణాల తీపీ వుంటే జరగడానికి వీల్లేదు" అంటూ వరనుండి కత్తి తీశాడు. విద్యున్మాల యేమనుకుందో గాని మారుమాటాడకుండా వెంటనే గుఱ్ఱమెక్కి వెళ్లిపోయింది. తలారులు భయపడి పారిపోయారు. కార్యసిద్ధి రాకుమారుల కట్లన్నీ విప్పాడు. రాకుమారులందరూ కార్యసిద్ధికి నమస్కరించి, సెలవు తీసుకుని వెళ్లిపోయారు. ఒక్కడు మాత్రం యేడుస్తూ నిలబడ్డాడు. కార్యసిద్ధి అతన్ని కౌగలించుకుని, బుజ్జగించుతూ "ప్రమోదా! నేను చెప్పిన మాట విన్నావు కావు. అంగరాజ్యానికి పోవద్దంటే వచ్చావు. ఇరవైనాలుగ్గంట లాలస్యమైతే యీపాటికి నాకుదక్కేవాడివిగావు. ఈ విద్యున్మాలే ధూమకేతు కూతురు. నిన్ను పోల్చివున్నట్లయితే వెంటనే నిన్ను చంపించేసేది. ఆమె యిప్పుడు నా భార్య. ఆ బంగారు చిలుక యీమె దగ్గరే వుంది. అంచాత ప్రభాసమణికూడా యీమెకడనే వుండవచ్చు. ఇహ మనకి మంచి రోజులు వచ్చినట్లే. నువ్వుమాత్రం కొంచెం ఓపిక పట్టాలి. ఈ వూళ్లోనే రహస్యంగా తిరుగుతూవుండు" అని చెప్పి, అతన్ని పంపి రాజనగరు చేరుకున్నాడు.

ఒకరోజున విద్యున్మాల పంజరంలో చిలకను చూడటానికి వెళ్లింది. కాని అందులో చిలక లేదు. విద్యున్మాల విస్తుపోయి, వెంటనే భటులను పిలిచి కోటా, పేటా గాలించమంది. ఎక్కడా దొరక లేదు. కార్యసిద్ధిని వుపాయం చెప్పమంది. ఆ చిలకంత విలువైన వస్తువు చిలక తెచ్చినవారి కిస్తానని దండోరా వేయించమన్నాడు. విద్యున్మాల ఆప్రకారమే తనదగ్గరున్న ప్రభాసమణి నిస్తానని చాటించింది. కార్యసిద్ధి తన పాచిక పారిందని సంతోషిం[illegible]డు.

ఆమర్నాడు ఆ వూళ్లోనే వున్న ప్రమోదుడు తనకు కార్యసిద్ధి రహస్యంగా తెచ్చియిచ్చిన బంగారు చిలకను తీసుకుని బైరాగివేషంలో వెళ్లి విద్యున్మాలకు యిచ్చాడు. తనకా చిలక ఒక అడవిలో దొరికిందన్నాడు.

విద్యున్మాల ఆ చిలకను తీసుకుని ప్రభాసమణి నిచ్చింది.

ప్రమోదుడు ఆ మణిని తీసుకుని మహేంద్రనగరం వెళ్లాడు. రాజు వద్దకు వెళ్లి "రాజా! ప్రభాసమణిని తెచ్చాను. నేను అంగదేశపు రాజకుమారుడిని. మా రాజ్యాన్ని కళింగరాజు జయించాడు. నేను నీ కుమార్తెని మోహించాను. ఆమెను నేను వివాహం చేసుకుంటాను." అని చెప్పాడు.

రాజు ఆ మణిని తీసుకుని "మణిని తెచ్చినవారికి అర్ధరాజ్యమిస్తానన్నానుగాని. నా కుమార్తె నిస్తాననలేదే. అయినా నువ్వు రాజ్యం లేని రాజువి. నీకు నా కుమార్తె నెల్లా యివ్వను? రాజ్యం సంపాదించుకువస్తే స్వయంగా ప్రభ నిచ్చి పెళ్లిచేస్తాను." అన్నాడు.

ప్రమోదుడు సరేనని కార్యసిద్ధి వద్దకు వెళ్లాడు. సంగతి నంతా చెప్పాడు. "ఐతే మళ్లీ బైరాగి వేషమే వేసుకో" అన్నాడు కార్యసిద్ధి.

ఆనాటి రాత్రి పడకగదిలో విద్యున్మాల వచ్చే వేళకి కార్యసిద్ధి తన వేషం తాలూకు పటాటోపమంతా విప్పి పారేస్తున్నాడు. విద్యున్మాల వచ్చి యిదంతా యేమి"టంది. "నేను సన్యసించేస్తున్నాను" అన్నాడు కార్యసిద్ధి. "ఏమిటీ వైరాగ్యం! రాజ్యంమీదా రాణీమీదా?" అని అడిదిగింది.

"రాజ్యమే కావాలని దేవు ఆరాణీమీదే" అన్నాడు సిద్ధి. విద్యున్మాల "అదేమిటి సిద్ధిరాజా! నాకు నీవే కావాలి. నీకన్నా రాజ్యమెక్కువా?" అంది. "అయితే నాకోసం రాజ్య వదిలేస్తావా?" అన్నాడు కార్యసిద్ధి. "నేను అంగరాజ్యం వదిలేస్తాను. కాని తండ్రి తాతలనాటి కళింగరాజ్యం కూడా వదులుకో

(౩౬-వ పేజీ చూడుడు)

బొమ్మరిల్లు :

# ప్రతివార్త

ఇప్పటిదాకా జరిగిన కథ :—మాస్కో నగరంలో ఉంటున్న అన్నదమ్ములు చుకూ, గెకూ వాళ్ల అమ్మతో కలిసి ఎంతో దూరాన అడవిలో వుద్యోగం చేస్తున్న వాళ్లనాన్న దగ్గిరికి బయల్దేరివెళారు. వాళ్ల నాన్న, మిగతా ఉద్యోగులతో కలిసి ఏదో పనిమీద ఇంకో చోటికి వెళ్లాడు. నాన్న ఉండే ఇంటిలో కాపలావాడొకడు కనిపించి తల్లికి పిల్లలకి ఎంతో సహాయం చేసి, రొట్టెలూ కాబేజి పులుసూ పెట్టాడు. తరవాత వాడి దోవన పోయాడు. ఒకరోజున గెక్ తమాషా చేద్దామనీ ఒక పెట్టెలో పడుకుని అలాగే నిద్రపోయాడు. పాపం వాళ్లమ్మ పిల్లాడేమైపోయాడోనని గాభరాతో అన్నిచోట్లా వెదికింది.

క్రిందటి నాలుగురోజులనుంచి ఎన్నో పాదాల గుర్తులు మంచు మీద దిగిఉన్నాయి ఎటునించి ఎటు వెదకాలో అర్థంకాలేదామెకి. బాటవెంబడే వెతుకుతూ బయలుదేరింది-ఆ బాటమీద ఒక్క ప్రాణి గూడా లేదు.

తుపాకి బారుచేసి పేల్చింది. చెవులు విరుచుకుని విన్నది. రెండోసారి పేల్చింది-మళ్ళీ మూడోసారి నొక్కింది మీట!

ఎక్కడినించో దగ్గిర్లోంచే జవాబు వినిపించింది. ఎవరో పరిగెత్తుకొస్తున్నట్టున్నారు. ముందుకు ఉరకాలనిచూసింది. బూట్లు గట్టిగా మంచులో దిగబడిపోతున్నాయి. లాంతరు జారిపడి చిమ్నీ పగిలిపోయింది- గాలికి దీపం ఆరిపోయింది.

ఒక్కసారిగా పెద్ద కేక వినిపించింది గుడిసెలోంచి. తుపాకి శబ్దం విని చుక్ అనుకున్నాడు, గెక్‌ని తోడేళ్ళు చంపుకుతినేసి ఇప్పుడు అమ్మమీద పడ్డాయని.

ఆమె లాంతరు నొక తన్ను తన్నింది. ఏడుస్తూ ఇంటికి పరుగెత్తుకెళ్ళింది. కోటు లేకుండా బైటికొచ్చిన చుక్‌ని గుడిసెలోకి తోసుకెళ్ళింది. తుపాకి ఒక మూల విసిరేసి, మంచునీటిలో చెంచా ముంచి తొందరతొందరగా రెండుగుటకలు మింగింది. మెట్లమీద ఏదో చప్పుడైంది. తలుపు బార్లాగా తెరుచుకుని కుక్క లోపలికి పరిగెత్తుకొచ్చింది. వెనకాల కాపలామనిషి వస్తున్నాడు వగర్చుకుంటూ. "ఏం జరిగింది? ఈ గొడవంతా ఏమిటి?" అన్నాడు.

"అబ్బా యెక్కడా కనుపించడం లేదు!" అంది ఆమె.

"ఒక్క నిముషం ఆగండి- ఏడవొద్దు!" అతడు తొందరగా అన్నాడు. "ఎంత సేపయింది వెళ్ళి- ఇప్పుడేనా? చాలా సేపైందా?... తిరుగు వెనక్కి తిరుగు." ఆజ్ఞాపించాడు కుక్కని "చెప్పండి! మీ పుణ్యముంటుంది తొందరగా చెప్పండి! !"

"ఒక గంట అయింది! మేము నీళ్ళకోసం బైటికెళ్ళాం. తిరిగొచ్చేటప్పటికి కనిపించలేదు. కోటు, టోపి తీసుకుని వెళ్ళిపోయాడు." జవాబిచ్చిందామె.

"ఒక గంటలో ఎంతో దూరం వెళ్ళలేడు. బూట్లు, కోటుఉన్నాయి కాబట్టి మంచు ఏమీ చేయలేదతన్ని. స్మెల్లీ! ఇటురా ఇది కాస్త వాసన చూడు!" అతను వంకీనించి గెక్ బనీను కిందికి లాగి, అతని చెప్పులతో గూడా దాని ముక్కు క్రింద పెట్టాడు. అది జాగ్రత్తగా పీల్చి, తెలివిగా అతనివంక చూసింది.

గభాలున తలుపు లాగి "పద! నా వెంట రా- చుట్టూ చూసొద్దాం. రా స్మెల్లీ!" అన్నాడు. అది తోక ఆడిస్తూ ఉన్నచోటునించి కదల్లేదు. "ఊఁ. ఉరుకు బైటికి?" కఠినంగా ఆజ్ఞ ఇచ్చాడతను. విరామం లేకుండా గాలి పీలుస్తూ, కుక్క నేలని గీకిందేగాని ముందుకు నడవలేదు. ఏమిటిది? రామ్మారా!" అని బుజ్జగిస్తూ, అవి మళ్ళీ వాసన చూపించి, అతను దానిమెడపట్టీ పట్టుకున్నాడు.

అయినా స్మెల్లీ అతని వెంట రాలేదు. ఇటూ అటూ తిరిగి, చివరికి వెనక్కి తిరిగి నడిచింది.

అక్కడొక పెద్ద చెక్కపెట్టె దగ్గి రాగి, గోళ్ళతో దాని మూత గీకడం మొదలెట్టింది. దాని యజమానివేపు చూసి మెల్లిగా మూడు అరుపు లరిచింది.

అతను తుపాకిని ఆమెచేతిలో పెట్టి, ఆ చెక్కపెట్టెమీది కెక్కి మూత వెనక్కి తోసేశాడు.

అందులో గొఱ్ఱెకంబళ్ళమీద గెక్ నిద్రపోతున్నాడు కోటు కప్పుకుని.

అతన్ని ఇవతలకి తీసి మెళుకువ తెప్పిస్తే కళ్ళు నిద్రతో వాలిపోతున్నాయ్. ఏమిటో ఈ గొడవంతా అతని కర్థంకాలే. వాళ్ళమ్మ

మూలం :
ఆర్కాడీ గైడర్

అనువాదం:
కృష్ణ ప్రసాద్

ఏడుస్తూ అతన్ని ముద్దుపెట్టుకుంటోంది.

ఆ బొచ్చుకుక్క స్మెల్లీమూతిమీద ముద్దుపెట్టుకున్నాడు చుక్. దానికి గాభరా పుట్టి అవతలికి పరిగెత్తింది. ఇదంతా ఏమిటో దానికి తెలియలేదు. మెల్లిగా తోకాడించుకుంటూ బల్లమీద రొట్టెముక్కవేపు ఆశతో చూస్తోంది.

చివరికి తేలిందేమిటంటే-గెక్ వాళ్ళమ్మా చుక్కు వెళ్ళిపోయిం తర్వాత చాలాసేపటికి, చెడ్డ విసుగు పుట్టి, ఒక తమాషా చేద్దామనుకున్నాడు. కోటు, హాటు తీసుకుని ఆ చెక్కపెట్టెలో కెక్కి కూచున్నాడు. అతని ఉద్దేశ్యమేమిటంటే వాళ్ళు తిరిగి వచ్చి తన కోసం వెతకడం మొదలుపెట్టేదాకా ఆగి, అప్పుడు పెట్టెలోపల్నుంచి అరిచి వాళ్ళని బిత్తరకొట్టామని. అయితే వాళ్ళు రావడం చాలా ఆలస్యమైపోవడం వల్ల, అట్లా చూస్తూచూస్తూనే నిద్రపోయాడతను-అంతే!

గబిక్కని కాపలాఅతను ఒక పెద్ద తాళంచెవి, నీలపు కవరు బల్లమీద పడేశాడు. "ఇదిగో! ఇది మా యజమాని సెర్యోగిన్‌గారి గది తాళంచెవి. అది ఆయన రాసిన ఉత్తరమూ ఆయ నింక నాలుగురోజుల్లో ఇక్కడికి వచ్చేస్తారు. సరిగ్గా సంవత్సరాదిరోజుకి"

అయితే అక్కడికన్నమాట ఈ మొరటు మునలాడెల్లొచ్చింది. బోన్లు చూసుకుని వస్తానని చెప్పి అంతదూరం, అల్కారా అగాధం దగ్గిరి కెళ్ళొచ్చాడు.

ఉత్తరం చించకముందే వాళ్ళమ్మ, చేత్తో అతని భుజం మీద తట్టింది.

జవాబు చెప్పకుండా అతను, ఆ చెక్కపెట్టెలో అట్టపెట్టెలన్నీ నలిపేసినందుకు గెక్‌మీదా, లాంతరు పగలగొట్టినందుకు వాళ్ళమ్మమీదా సణుగుడు ప్రారంభించాడు. అయితే ఇప్పుడెవరూ అవి లెక్క చేసేవారు లేరు.

వాళ్ళమ్మ అతనంటే ఎంతో శ్రద్ధ చూపింది. ఏదన్నా శబ్దమైతే అతను వెళ్ళిపోతున్నాడేమో అని చూసేది. చుక్‌కి ఎంత కోపమొచ్చిందంటే, తను గూడా గెక్‌లాగా పెట్టెలో పడుకోవాల్సింది అనుకున్నాడు.

పొద్దున్నే కాపలాఅతను వాళ్ళ నాన్నగది తాళం తీశాడు. స్టవ్ వెలిగించేసి, వాళ్ళ సామానంతా తెచ్చిపెట్టా డక్కడ. గది చక్కగా విశాలంగా ఉంది. అయితే అందులోవన్నీ ఇష్టమొచ్చినట్టు పడున్నాయ్.



వాళ్ళమ్మ అప్పుడే ఇల్లు కడగడం మొదలెట్టింది. గోజల్లా అటు దిటూ, ఇటు దటూ మారుస్తూ, ఊడుస్తూ, కడుగుతూ, తుడుస్తూనే గడిపింది.

సాయంత్రం కాపలాఅతను కట్టెలు తీసుకొస్తూ, ఆశ్చర్యంతో గుమ్మందగ్గిరే ఆగిపోయాడు. అడుగు ముందుకు వేయడానికి అతనికి మనస్సొప్పడంలేదు! అద్దంలా వున్న గది చూసేటప్పటికి. స్మెల్లీ మాత్రం గబగబా లోపలి కొచ్చేసింది.

అప్పుడే చక్కగా కడిగిన నేలమీంచి విదిలించుకుంటూ వెళ్ళి గెక్‌కి తాకించింది చల్లటి ముక్కు. "అరె! నిన్ను కనిపెట్టింది నేనే గదా-నా కేదన్నా తినడానికి మంచిదివ్వాలి నువ్వు?" అంటున్నట్టు. వాళ్ళమ్మ కొద్దిగా జున్నుముక్క పడేసింది దానికి.

ఆ కాపలా అతను విసుక్కున్నాడు. కుక్కలకి జున్నుముక్కలు పెట్టడం మొదలెట్టే ఇక అయినట్టే అని. అతనికిగూడా ఒక పెద్దముక్క పెట్టింది. "థాంక్ యు!" అంటూ తీసుకుని వెళ్ళిపోయాడు నగరవాసుల ప్రవర్తనకి వింతగా తల ఆడించుకుంటూ.

నాలుగురోజులూ చూస్తూండగానే గడిచిపోయినాయ్. రేపే సంవత్స

(౩౮-వ పేజీ చూడుడు)



**బాలగేయం:**

# బొమ్మల పెళ్లి

శ్రీ [illegible]



బొమ్మరింటిలో బొమ్మల పెళ్లికి
అమ్మలక్కలూ వచ్చారు.
బాకా లూదుతూ, డోళ్లు కొట్టుతూ
బాజా భజంత్రి చేశారు.
పెళ్లికూతురుకి పెళ్లికుమారుడు
మెళ్లో సూత్రం కట్టాడు.
పెద్దలందరూ తథాస్తు అంటూ
ఇద్దరి కక్షత లేశారు.
సంగీతంతో పేరంటాళ్లూ
మంగళహారతి పాడారు.
విస్తళ్లేసి గుజ్జనగూళ్లను
మస్తుమస్తుగా పెట్టారు.
అలక పానుపూ, ఊరేగింపూ,
అప్పగింతలూ జరిగాయి.
పెళ్లికి వచ్చిన పెద్దలందరూ
ఇళ్లకు మళ్లీ పోయారు.
సంగనాచిలా పెళ్లికూతురూ
దొంగచూపులూ చూసింది.
పెళ్లికుమార్తెని పెళ్లికుమారుడు
గిల్లి మెల్లిగా నవ్వాడు.
బుగ్గలనిండా గులాబుల్లే
సిగ్గుల మొగ్గలు పూశాయి.



# ఆకాశంలో జరిగే వింతలు

కిందటి వారంలో ఒక విషయం తెలుసుకోవటం మరిచిపోయాము. ఆకాశంలో మిలమిల మెరిసేవన్నీ నక్షత్రాలు కాదు. సూర్యుడి కుటుంబానికి చెందిన శుక్రుడు, బృహస్పతి మొదలైన గ్రహాలు కూడా సరిగ్గా నక్షత్రాలలాగానే మెరుస్తూ వుంటాయి. ఇవి కాక అక్కడక్కడ మెరుస్తున్న మబ్బుతునకలు కనిపిస్తాయి. ఈ మెరిసే మబ్బులు నిజమైన మబ్బులు కావు.

## నక్షత్రాల పిండి

చేగోడీలు చెయ్యటానికి బియ్యప్పిండి, సెనగపప్పు, ఉప్పు, కొద్దిగా కారం ఇవన్నీ కలిపి చేగోడీల పిండిని ముందు తయారు చేస్తాము. అయినా ఈ పిండి తింటే చేగోడీలు తిన్నట్టు ఉంటుందా? దానిని చేగోడీల ఆకారంలో చేసి బాణ్లి మూకుడులో వేసి వండాలి.

అల్లాగే నక్షత్రాలు దేనికది వేరువేరుగా తయారు కావటానికి నక్షత్రాలపిండి ఒకటుండాలిగా. ఆకాశంలోని మెరిసే మబ్బులు అల్లాంటి పదార్థం. అలాంటి పదార్థంలోనించే మనకి కనిపించే నక్షత్రాలన్నీ వచ్చాయి. ఈ మెరుపు మబ్బులు ముద్దలు కట్టి ఎన్ని కోట్ల ఏళ్లకి ఎన్ని కోట్ల నక్షత్రాలుగా తయారవుతాయో ఎవరూ చెప్పలేరు. కొన్ని ఇప్పటికే నక్షత్రాలుగా తయారయి వున్నాయి కూడా. అందుకే ఆ మెరుపు మబ్బుల మధ్య మినుకు మినుకుమంటూ అక్కడక్కడ ఒక నక్షత్రం కనిపిస్తూవుంటుంది.



అమెరికాలోని చికాగో పట్టణంలో ఒక పెద్ద టెలిస్కోపు యంత్రం వున్నది. దానిలోనుండి ఈ 'ఆండ్రోమీడా' అనే మెరుపుమబ్బును ఫోటో తీశారు.

## చంద్రు డెవరు?

ఇక మన భూమిసంగతి. భూమి సూర్యుడిలోనుంచి పగిలిన ముక్క అని తెలుసుకున్నాము. ఆ పగిలిన రోజుల్లో భూమి ఎల్లా వుండేదో ఊహించటం మన తరంకాదు. కాని ఇప్పుడున్నమాదిరిగా చల్లగా చెట్టు చేమలతో ఉండేది కాదని మాత్రం చెప్పగలం. బహుశా అప్పుడు సూర్యుడి మోస్తరుగానే భగభగ మండుతూ చాలా కాంతిగా వుండేది.

క్రమేణా భూమి గిరగిర తిరుగుతూ సూర్యుడికి దూరంగా పోతున్న కొద్దీ చల్లబడిపోయింది. భూమి సూర్యుడినుంచి వేరుపడి దాదాపు 200 కోట్ల ఏళ్లయింది. ఒక వంద కోట్ల ఏళ్లకిందట క్రమంగా చల్లపడటం ప్రారంభించింది. మంటలు తగ్గిపోయాయి. మండే కొన్ని రకాల వాయువులు చల్లబడి నీళ్లై సముద్రాలయ్యాయి. నెమ్మదిగా కొండలు, మన్ను తయారయ్యాయి.

కాని అంతకు ముందే ఎప్పుడో భూమిలో మళ్లీ ఒక ముక్క విరిగి గిరగిర తిరుగుతూ దూరంగా పోయింది. అది సూర్యుడికి బాగా దూరంగా ఉండటంవల్ల దబ్బున చల్లపడి పెద్ద మంచుగడ్డలా తయారయింది. ఆ ముక్క మన చంద్రుడే. సూర్యుడిలో నుంచి వచ్చిన భూమి సూర్యుడి చుట్టూ ప్రదక్షిణాలుచేస్తున్నట్టే భూమిలో నుంచి వచ్చిన చంద్రుడు భూమిచుట్టూ తిరగటం మొదలుపెట్టాడు.

## గ్రహణాలు ఎలా వస్తాయి?

ఈ తిరగడంలో ఒక తమాషా జరిగింది. భూమి సూర్యుడిచుట్టూనే కాకుండా తన చుట్టూ తను తిరుగుతున్నది. తనచుట్టూ తను తిరగటానికి పట్టే టైమునే ఒక రోజు లేక 24 గంటలు అంటున్నాము. భూమి 360 సార్లు తనచుట్టూ తను తిరిగేటప్పటికి సూర్యుడిచుట్టూ ఒకసారి తిరిగి వచ్చేస్తోందన్నమాట. అంటే భూమి సూర్యుడిచుట్టూ తిరగటానికి ఒకఏడాది పడుతుందన్నమాట.

ఇక చంద్రుడు భూమిచుట్టూ ఒకసారి షికారు కొట్టివచ్చేటప్పటికి 30రోజులు లేక ఒక నెల పడుతుంది.

జరిగే తమాషా ఏమిటంటే— సంవత్సరంలో ఏదో ఒక రోజున సూర్యుడికి భూమికి మధ్య చంద్రుడు అడ్డంవస్తాడు. అప్పుడు చంద్రుడు, భూమి, సూర్యుడు ఒకే వరసలో వుంటారు. అల్లా వున్న ఆ కాస్సేపూ భూమిమీద వున్న మనకి సూర్యుడు కనిపించడు. దాన్నే సూర్యగ్రహణం అంటాము. మళ్లీ చంద్రుడు తిరుక్కుంటూపోగానే సూర్యుడు మామూలు ప్రకారం కనిపిస్తాడు. అప్పుడు గ్రహణం అయిపోయిందంటాము.




ఇల్లాగే సంవత్సరంలో ఎప్పుడో ఒక రోజున సూర్యుడికీ చంద్రుడికీ భూమి అడ్డం వస్తుంది. ఇక్కడ ఒక సంగతి గుర్తుపెట్టుకోవాలి. చంద్రుడికి తనంతట తను కాంతిని చిమ్మే శక్తి లేదు. సూర్యుడి కాంతి చంద్రుడిమీద పడుతుంది. అప్పుడే చంద్రుడికి ప్రకాశం వస్తుంది. గాజుముక్క ఒకటి వుందనుకోండి. అది చీకట్లో పెడితే మెరుస్తుందా? మెరవదు. దాన్ని ఎండలో పెడితే సూర్యుడి కాంతి దానిమీద పడుతుందికనకనే తళతళ మెరుస్తుంది. అల్లాగే చంద్రుడూ ఒక గాజుముక్కలాంటివాడే.




సరే భూమి సూర్యుడికీ, చంద్రుడికీ అడ్డంగా వచ్చేటప్పటికి సూర్యుడి కాంతి చంద్రుడిమీద పడదు. అప్పుడు భూమిమీద వున్న మనకి చంద్రుడు కాస్సేపు కనిపించడు. భూమి అడ్డం తొలగగానే చంద్రుడు మళ్లీ మామూలుగా ప్రకాశిస్తూ కనిపిస్తాడు. దీన్నే చంద్రగ్రహణం పట్టడం పోవటం అంటాము.

మన పెద్దవాళ్లు మనకివేమీ చెప్పరు. అసలు వాళ్లకి సూర్య, చంద్ర గ్రహణాలు ఎందుకు వస్తాయో తెలియదు. అందుకనే ఏదో

పాము వచ్చి చంద్రుణ్ణి, సూర్యుడినీ మింగేస్తుందనీ, మళ్ళీ విడిచిపెడుతుందనీ పిట్టకథ చెబుతారు. మీరు అసలు సంగతిని వాళ్ళతో చెబుతారనుకోండి. వాళ్ళు నమ్మరు. "పోరా, చెప్పొచ్చావు" అంటారు.

అప్పుడు వాళ్ళకేమని చెబుతారు మీరు? పాములనేవి భూలోకంలోనే తిరిగే జంతువులు. ఇవి ఆకాశంలోకి ఎగరలేవు. పైగా సూర్యుడు చంద్రుడు ఎంత పెద్ద కొండచిలువైనా మింగగలిగేటంత చిన్న వస్తువులు కావు, అని చెప్పాలి.

---

## చందమామ

(26-వ పేజీ తరువాయి)

మని. ఆ అమ్మాయి నిజంగా మనుషుల పిల్లే. అయినా దేవతల పిల్లంత అందంగా వుంది. ఆ పిల్లను చూడగానే చందమామకు ముద్దొచ్చి, బుగ్గమీద నొక్కి ముద్దుపెట్టుకుని "నా కెంత అందమైన మేనగోడలు వుందో?" అనుకుని వెళ్ళిపోయాడు.

కాని చందమామ ఆ పిల్ల బుగ్గల మీద వేళ్ళతో నొక్కినచోట్ల రెండు సొట్టలు పడ్డాయి. అవి ఎప్పటికీ పోలేదు. చందమామ ముద్దుపెట్టుకున్నచోట బుగ్గలమీద ఎర్రబడింది. ఆ ఎరుపు కూడా అల్లాగే వుండిపోయింది. అందుకనే అందమైన అమ్మాయిలు నవ్వినప్పుడల్లా బుగ్గలు ఎర్రపడి సొట్టలుపడతాయి.

ఏదీ, నువ్వు నవ్వమ్మా బుల్లెమ్మా!" అన్నాడు కామయ్య.

మా చెల్లాయి పకపక నవ్వింది. రెండు బుగ్గలూ ఎర్రబడి, రెండు సొట్టలు పడ్డాయి.

---

## స్వయంప్రభ

(29-వ పేజీ తరువాయి)

వాలా?" అని అడిగింది విద్యున్మాల.

"అది అక్కరలేదులే" అని జవాబిచ్చాడు కార్యసిద్ధి. "అయితే అంగరాజ్యం యెవరికి ధారపోస్తావు." "అదంతా నా యిష్టం. ఒక బైరాగివాడికిస్తాను నీకెందుకూ?" అన్నాడు. "బైరాగికి రాజ్యం ఎందుకూ?" అంది. "కొన్ని సమయాల్లో కొందరు సంసారులకు సన్యాసం పుచ్చుకోవాలనీ, సన్యాసులకి సంసారాలు చెయ్యాలనీ అనిపిస్తుంది." అన్నాడు సిద్ధి.

ఒక మంచిరోజు చూసి కార్యసిద్ధి అంగరాజ్యాన్ని వైరాగి వేషంలో వున్న ప్రమోదుడికి ధారపోయించాడు. ప్రమోదుడికి రాజ్యం తిరిగి వచ్చింది. తరవాత ఈ సంగతిని మహేంద్రనగరానికి కబురుచేశాడు. మహేంద్రనగర రాజు చాలా సంతోషించి స్వయంప్రభాదేవిని ప్రమోదుడికిచ్చి పెళ్ళి చేశాడు.

విద్యున్మాల కళింగరాజ్యానికి భర్తతో వెళ్ళిపోయింది. కళింగదేశంలో విద్యున్మాల, కార్యసిద్ధి పరిపాలిస్తున్నారు. ఇక్కడ ప్రమోదుడు, స్వయంప్రభ అంగరాజ్యాన్ని, మహేంద్ర నగరాన్ని కూడా పాలిస్తూ సుఖంగా వున్నారు.

---




స్వర్ణనగరాన్ని పూర్వం సుకర్ణుడనే రాజు పాలించేవాడు. ఆయన ఒకసారి సుశర్మదేశాన్ని పాలించే సుశర్మకి ఒక ఉత్తరం రాశాడు.

"నాకు వెంటనే తెల్లటి వళ్లు ఎర్రటి తోక కలిగిన ఒక ఆవును పంపించు. లేకపోతే—"

ఈ ఉత్తరం సుశర్మ చూసుకున్నాడు. "నాదగ్గర అల్లాంటి ఆవు లేదు. ఒకవేళ అల్లాంటిది ఉంటే నీకు—" అని మళ్లీ ఉత్తరం రాసి సుకర్ణుడికి పంపించాడు.

ఈ ఉత్తరాన్ని సుకర్ణుడు చూసుకోగానే అతనికి వళ్లు మండింది. "సుశర్మకి మహాపొగరుగా వుందే." అనుకునియుద్ధం ప్రకటించాడు.

ఇద్దరు రాజులూ యుద్ధం చేసుకున్నారు. ఎన్ని నెలలు జరిగినా యుద్ధం ఎటూ తెగలేదు. చివరికి రాజులిద్దరూ ఒకచోట సమావేశమై సంప్రదింపులు చేసుకుందామనుకున్నారు. ఇద్దరూ కలుసుకున్నారు.

సుశర్మ అడిగాడు. "ఏమిటయ్యా సుకర్ణా! నీవుద్దేశ్యం? 'తెల్లటివళ్లు ఎర్రటితోక గల ఆవుని పంపించు. లేకపోతే—' అని ఏదో పెద్ద బెదిరింపుగా రాశావు? నీ బెదిరింపుకి జడిసే వారెవరూ లేరిక్కడ."

"నేనేం బెదిరించలేదే. లేకపోతే మరేరంగుతోక వున్న ఆవైనా ఫరవాలేదని నా ఉద్దేశ్యం. అయితే నువ్వు 'నాదగ్గిర అల్లాంటి ఆవు లేదు. ఒక వేళ ఉంటే నీకు—' అని రాశావేమిటి? 'నీకెందుకు పంపించాలి?' అనేగా నీ ఉద్దేశ్యం?" అని గదమాయించాడు సుకర్ణుడు.

"అదేం కాదోయ్ సుకర్ణా! ఒకవేళ ఉంటే నీకు తప్పక పంపిస్తానని నా ఉద్దేశ్యం."

"అరెరే! ఎంత తెలివితక్కువ సన్నాసులం మనం? యుద్ధం మానేసి ఇకనుంచీ మళ్లీ స్నేహంగా వుందాం. ఏం?" అన్నాడు సుకర్ణుడు.

ఇద్దరూ యుద్ధం మానేసి స్నేహితులయ్యారు. అందుకనే మాట చివ్వరిదాకా వినందే కోపం తెచ్చుకోవద్దని పెద్దలంటారు.

---

# కథ కంచికి ఎందుకు వెళ్లింది?

★

**శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు**

మనకి ఏ కథ నన్నా చెప్పినప్పుడు అంతా అయిపోయింతరవాత చివరికి "కథ కంచికి, మనమింటికి" అనటం అందరికీ అలవాటు.

కథ కంచికి వెళ్లట మేమిటి, అని మీ రెప్పుడైనా ఆలోచించారా? లేదు కదూ? అయితే దానికి కారణం చెబుతాను, చదవండి.

పూర్వం కంచిపట్టణంలో గొప్ప గొప్ప కవులు, పండితులూ, విద్వాంసులు ఉండేవారు. వాళ్లంతా ఒక సంఘంగా చేరి ఎవరే కథ రాసినా, లేక కావ్యం రాసినా అదిచదివి మంచిదో, చెడ్డదో చెప్పేవాళ్లు. దేశంలో ఎక్కడెక్కడ వున్నవాళ్లూ తమ కథలనీ, కావ్యాలని కంచికి పంపేవారు. కథ బాగుంటే దానిమీద ఒక రకమైన ముద్ర వేసే వారు పండితుల సంఘంవారు. ఆ ముద్ర వుంటేనేఆ కథకి దేశంలో బాగా పేరు వచ్చేది. అది లేకపోతే దాన్నెవరూ చదివే వారు కాదు.

అందుకని ప్రతివాళ్లూ తమ కథలని కంచికి పంపేవారు. అందుకనే ప్రతి కథకీ చివరకథ కంచికి, అనటం మనకి అలవాటయి పోయింది.

---

గేయం :

# మాతృకాంక్ష

శ్రీ ఆరుద్ర

అడిగింది ఒక తల్లి
ఒక తల్లి అడిగింది
ఇహం పొలిమేరలో
పరం తొలి దారిలో
నిలిచి కొడుకుని తలచి
కలచు గుండెలలో
అలలమాదిరి పొంగి
పొరలు ప్రశ్నలతో..
    అడిగింది ఒకతల్లి
    ఒకతల్లి అడిగింది
కబురు అందని చోట
కలలు విరిగిన చోట
అడిగింది ఒక తల్లి
అడిగింది తొల్లి
"మోహనదాసు కులాసాగా ఉన్నాడా?
అమ్మా, అమ్మ పోయిందని అన్నాడా?
సీమనించి తిరిగొచ్చాడా?
పెద్ద పరీక్ష ఇచ్చొచ్చాడా?
అందరిలాంటివాడు కాడు అబ్బాయి
అల్లాగని అసలే కాడు ఆకతాయి
మబ్బు పనకొతల సూర్యకిరణంమల్లే,
గుబురు ఆకుల మధ్య మల్లెపూవుమల్లే,
అందరికీ అందనివాడు, వాడు.
వాడిలాంటివాడు ఇంకోడు లేడు.
దివాన్గిరీ చేశాడా? దివాలా తీశాడా?
కుటుంబంపరువు నిలబెట్టేడా?
పెళ్లాన్ని ఏలుకొంటున్నాడా
సజావుగా సంసారం చేస్తున్నాడా?"
అని అడిగింది ఒక తల్లి
ఒకతల్లి అడిగింది
    మేఘాల భూమిలో,
    కోరికల కోటలో,
నోము పండినవాగ
పూచి మురిసే తోట,
    తనువు వీడినవాగ
    వేచి ఉండే చోట,
మృత్యుసీమను నిలచి,
కన్న కొడుకుని తలచి,
    అడిగింది ఒక తల్లి
    ఒక తల్లి అడిగింది.
"అబ్బాయి ఆడి తప్పనివాడే గానీ
సారాయి తాగననీ,
మాంసం ముట్టుకోననీ
సానిళ్ళకు వెళ్ళననీ,
చేతిలో చెయ్యి వేసి
ప్రమాణం చేశాడు,
నిలబెట్టుకొన్నాడా?
మోహనదాసు కెంతమంది సంతానం?
మా కోడలు నింపాదిగా ఉందా?"
అని
తనకు తానే ప్రశ్న
అడిగింది ఒక తల్లి.
తనకు తానే వ్యథను
పొందింది ఒక తల్లి.
    బదులు చెప్పెను ఒకడు
    బరువు మాటలతో
    భక్తితో, బాధతో
    బదులు చెప్పెను ఒకడు
"అతడు సామాన్యుడా?
అతడు మాన్యుడు సుమా
అతడు పుట్టిన కడుపు
అవని తీర్చని ఋణము
అతడు మెట్టిన భూమి
అత్యంత పావనము
అడుగడుగునా విఘ్నాలు,
ఆశలకు అవాంతరాలు,
ఆశయాలకు అనకట్టలు,
ఆవేశాలకు చన్నీళ్లు
అభిప్రాయాలకు సంకెళ్లు,
ఆలోచనలకు బేడీలు
ఆదర్శాలకు ఉరిత్రాళ్ళు,
ఉత్సాహానికి కంట్రోలు
ఉద్రేకాలకి రేషను,
ఇహంలో నో వేకెన్సీ
పరంలో నో ఎడ్మిషన్,
కళ్ళకు కటకటాలు
కనికారానికి కారాగారం
కడుపులోకి కంకర
మా గీతలు వంకర,
మా చుట్టూ బానిసత్వం
    ఇటువంటి ఇరులలో
    ఇటువంటి వ్యథలలో
    అడుగు పెట్టెను అతడు
    అవని పండెను అపుడు
భయంకర స్వార్థాస్వాదితమై
లయంకర స్పర్ధాస్ఫారితమై
సర్వదేశ ప్రజ సంక్షోభస్తై
సత్యాహింసలు బోధన చేసిన
అతడు సామాన్యుడా?
అతడు మాన్యుడు గాని,
బ్రహ్మదేవుని నాల్గు వేదాలు
ధర్మదేవత నాల్గు పాదాలు
సకల మతములలోని సత్యాలు
అతని బోధనచేత నిత్యాలు."
అని
భక్తితో, శ్రద్ధతో
బదులు చెప్పెను ఒకడు
బదులు చెప్పెను ఒకడు
బరువు కన్నులతో
అంతంత మాటలు తనకు
అర్థం కాలేదు కనుక
అడిగింది ఒక తల్లి
అబ్బాయిని గురించి
అడిగింది ఆ తల్లి
అశ్రులు ధరించి
"మోహనదాసు బాగున్నాడా అంటే
ఏమేమో చెప్తారీయన
మీరేనా చెప్పండి స్వామీ
మా వాడు ఎలా గున్నదీ
మా వాడు రాజ్యాలేలక్కర్లేదు
కులాసాగా ఉంటే చాలు
మంచివాడనిపించుకొంటే
అదే నాకు పదివేలు."
అని
అడిగింది ఆ తల్లి
గుండె కొట్లాడ
అడిగింది అడిగింది
ఆత్రంతోడ,
మొరటు గుండెలవాడు
మూర్ఖ చిత్తమువాడు
పలుకు విషము లొలుక
బదులు చెప్పెను ఒకడు
"మీవాడా? ఛండాలుడు
మీవాడా? దుర్మార్గుడు
మాలవాళ్ళని మాతోపాటు
కూర్చోమన్నాడు
భోంచెయ్యమన్నాడు,
ఇంకా ఏం చెయ్యమనలేదూ!
పవిత్రమైన దేవాలయాల్లో
అంటరానివాళ్ళను అంటగట్టేడు
తురకాళ్లతో భుజం భుజం కలిపి
తుంటరులను వెనకేసుకొని
తూలిపడ్డాడు
చెయ్యరాని పన్లు చేశాడు
అందుకే అన్నిసార్లు జెయిల్లో పెట్టారు
అందుకే ఆఖరిసారి మనవాడే మీవాడ్ని
గుండేసి కాల్చి చంపేశాడు,
మీవాడు దుర్మార్గుడు
మీవాడు పాపాత్ముడు"
    "ఓరి పాపాత్ముడా అతడు
    పాపాత్ముడా?
    మహాత్ముడు పుణ్యరాశి"

(40-వ పేజీ చూడుడు)

# తంతివార్త

(31-వ పేజీ తరువాయి)

రాది. పొద్దుటినుంచీ చుక్కూ-గెక్కూ- ఇంట్లోకి పోవడమే లేదు. ముక్కులు నల్లబడ్డాయి. అయినా ఇంకా కాలుకాలిన పిల్లుల్లాగా తిరుగుతూనే వున్నారు. వాళ్ళ నాన్నా, ఇంకా ఆయనతో వచ్చేవాళ్ళూ ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తూ.

నీళ్ళకరాయి పెచ్చు బెట్టున్న కాలంలోనూ "వాళ్ళు మధ్యాహ్నం భోజనం వేళకిగాని రారు. మీరు మంచులో పడిపోతున్నారు." అని మందలించాడు.

నిజంగా జరిగింది కూడా అంతే! బల్లదగ్గిర కూచుని చూపు, మునుపే కాలం లెక్కిస్తూ కీకీ దగ్గిర చప్పుడు చేశాడు. ముగ్గురూ అవతారాబాదరా కోట్లు వేసుకుని బైటికి పరిగెత్తారు.

"కళ్ళు బాగా పొడిచి ఉంచండి!- ఇంక కొన్ని సెకండ్లలో ఆ పెద్ద శిఖరానికి కుడివైపు నున్న కొండ వాలుమీద కనపడతారు. తరవాత అరణ్యంలో మాయమైపోతారు. ఆ తరవాత అరగంటలో వచ్చేస్తారిక్కడికి." అన్నాడతను.

అట్లాగే జరిగింది. కొండవెనక కనుమలో మొదట కనిపించింది ఒక కుక్కల గుంపు. తరవాత కొన్ని సామానుబళ్ళు, ఆ తరవాత కొంత మంది మనుషులు మంచుబోట్లమీద గబగబా వస్తున్నారు.

వెనకా ఉన్న పెద్ద పెద్ద కొండల మధ్య, చాలా చిన్నవాళ్ళులాగా కనిపిస్తున్నారు. అయితే వాళ్ళ చేతులూ కళ్ళూ కాళ్ళూ అన్నీ మంచుగడ్డలమీద స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆ వాలులోంచి క్రిందికి జారారు. క్రమంగా లోతైన అడవిలో దిగబడిపోయారు.

సరిగ్గా అరగంటకల్లా - కుక్కల అరుపులు, కేకలు, మంచుబోట్ల చప్పుడు చాలా దగ్గర్లోంచే వినిపించాయి. ఇల్లు దగ్గరలోనే ఉందని తెలుసుకున్నాక, కుక్కలు అడవిలోంచి పరుగు లంకించుకున్నాయి. వాటి వెనక తొమ్మండుగురు మంచునీరులు (స్కీయర్లు) ఒకరికొకరు కొంతదూరంలో, వస్తూ కనిపించారు.

చుక్ గెక్కుల్ని, వాళ్ళమ్మనీ మెట్లమీద చూసి సంతోషంతో కేకపెట్టారు వాళ్ళు, చేతుల్లో కర్రలు ఊపుతూ, వేగం తగ్గించకుండానే.

గెక్ ఇక ఆగలేకపోయాడు- మెట్లు దిగి పరిగెత్తాడు-ఎగురుతూ, పడుతూ, లేస్తూ అందరిలో పొడుగాటి, గడ్డపాయన దగ్గిరికి. ఆయన అందరికంటె గట్టిగా "హుర్రో!" అని అరుస్తున్నాడు.

సాయంత్రంపడేంతవరకు కడుగుళ్ళతో, ముఖపుళ్ళతో, ఇల్లూ వళ్ళూ శుభ్రంచేసుకోవడంతో గడిచిపోయింది.

సాయంకాలానికి అంతా సంవత్సరాదిపండుగ చేసుకోవడానికి, కులాసాగా కూచున్నారు.

మధ్య బల్ల వేశారు. దీపాలార్పేసి అన్నీ కొవ్వొత్తులు వెలిగించారు. చుక్ గెక్ తప్ప తక్కిన వాళ్ళంతా పెద్దవాళ్ళే-తరవాత ఏం చెయ్యాలో తెలియలేదు వాళ్ళకి.

అదృష్టవశాత్తూ ఒకాయనదగ్గిర ఏదో సంగీతవాయిద్యం ఉండడంవల్ల, అది తెచ్చి వాయించడం మొదలుపెట్టాడు. కూచున్న స్థానాల్లోంచి లేచి అంతా నాట్యం చేశారు, చుక్కూ, గెక్కూ, బలే తమాషాగా నృత్యం చేశారు ముఖ్యంగా వాళ్ళమ్మతో చేసినప్పుడు ఇంకా బాగా చేశారు.

వాళ్ళ నాన్నయితే డ్యాన్సు చేయలేదు. ఆయన మొంచి బలమైన మనిషి. చెక్కనేలమీద కాలు గట్టిగా దబాయించి మోపాడంటే, అంత దూరానున్న కప్పులు, ప్లేట్లు ఎగిరిపడతాయి. ఇంక ఆయన డ్యాన్సు చేస్తే?

చుక్నీ, గెక్నీ తొడలమీద కూచోబెట్టుకున్నాడు. వాళ్ళ వాయిద్యంతోపాటు తప్పెట్లు వేస్తున్నాడు, చప్పట్లు కొడ్తూ.

నృత్యం అయిపోయింది. వాళ్ళమ్మ గెక్ని పాటపాడమంది. గెక్ నాకు పాట రాదనలేదు- పాడననలేదు. తను పాడగలనని అతనికి తెలుసు. అందుకు గర్వపడతాడు కూడా! అతని పాటకోపాటే వాయిద్యం కూడా అనుసరించింది. బలే మంచిపాట పాడాడు. అతను పాడుతున్నంతసేపూ అంతా నిశ్శబ్దంగా విన్నారు.

అతను పాట పూర్తిచేయగానే అంతా గబగబా చప్పట్లు కొట్టి అరవడం మొదలెట్టారు. గెక్ని పట్టుకుని గాలిలోకి ఎగరేసేవారేగని. వాళ్ళమ్మ గబుక్కుని అందుకుంది. అతన్ని పైనున్న ఇంటికప్పుకేసి కొట్టారేమో, ఆ ఉత్సాహంలో అని ఆమె భయపడ్డది.

చేతి గడియారం వంక చూసి, "ఇక కూచోండి! అసలు కార్యక్రమం ప్రారంభమవుతోంది" అన్నాడు వాళ్ళ నాన్న. రేడియో తిప్పాడు. అంతా ఏమొస్తుందో అని కాచుక్కూచున్నారు.

మొదట అంతా నిశ్శబ్దమే. తరువాత ఏదో గొడవ వినిపించింది. కార్లు హారన్ కొట్టుతున్న శబ్దం, జనం గుబగుబలు, చప్పట్లు! తరువాత ఎక్కడినుంచో, ఎంతో దూరంనుంచి చక్కటి పాట వినిపించింది. పెద్దవీ, చిన్నవీ, గంటలు మోగుతున్నాయి. టీర్-లిలి-లిలీ-డాంగ్! టీర్-లిలి-లిల్లీ-డాంగ్..!

చుక్కా-గెక్కా-ఒకరివేపొకరు చూసుకున్నారు. వాళ్ళకి తెలుసు అదేమిటో. ఎంతో దూరంలో ఉన్న మాస్కోనగరంలో, ఎత్తయిన శిఖరంమీద-ఎఱ్ఱ స్తంభంమీద-బంగారుగంటల మోత.

ఈ తరంగాలు ప్రతి సంవత్సరాదినాడూ, అన్ని చోట్ల ఉన్న వాళ్ళకీ పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ, స్టెప్పీ గడ్డిబీళ్ళల్లోనూ, అరణ్యాల్లోనూ, నీలపు సముద్రాల్లోనూ-అంతటా వినిపిస్తాయి.

అంతా లేచి నుంచున్నారు. ఒకరి కొకరు, క్రొత్త సంవత్సరం ఎంతో అదృష్టంతో ఉజ్వలంగా ఉండాలని ఆశీర్వదించుకున్నారు.

అయితే అదృష్టం ఒక్కొక్కరి కొక్కొక్క విధంగా ఉంటుంది. అందరూ హాయిగా, గౌరవంతో, కష్టించి పనిచేస్తూ సోవియట్ రాజ్యం పేరుతో విలసిల్లే ఆ భూభాగాన్నంతా ప్రేమించి, సేవించాలనేది మాత్రం అందరికీ తెలుసు.

(కథ అయిపోయింది)




### రెండు పిల్లులు.

ఒకచోట రెండు పిల్లులు కూర్చున్నాయి. ఒకటి ఉత్తరంవేపుకి, మరొకటి దక్షిణంవేపుకి చూస్తున్నాయి, అవి వెనక్కి తిరక్కుండా ఒకదానొకటి చూసుకోవాలి. ఇదెట్లా కుదురుతుంది?

### జామపళ్లూ, అరటిపళ్లూ

లీల బజారుకి వెళ్లి బేడకి మూడు చొప్పున కొన్ని జామపళ్లు, అర్ధణాకి ఒకటి చొప్పున జామపళ్లెన్ని కొన్నదో అన్ని అరటిపళ్లూ కొనుక్కుంది. మొత్తం 7 అణాలు ఖర్చు పెట్టింది. అయితే 7 అణాలకీ ఎన్ని జామపళ్లు కొన్నది? ఎన్ని అరటి పళ్లు కొన్నది?

### పెద్ద బస్తాలో ఎన్ని వడ్లు?

రెండుగోనె సంచులలో మొత్తం 40 మానికల వడ్లు ఉన్నాయి. ఒక సంచిలో ఉన్నవాటిలో సగంకంటే 5 మానికలు తక్కువగా రెండో సంచీలో ఉన్నాయి. పెద్ద సంచిలో ఎన్ని వడ్లు ఉన్నట్టు లెక్క?

---

## మాతృకాంక్ష

(37-వ పేజీ తరువాయి)

అని సకల జీవరాశి
ఎలుగెత్తి పలికింది
కుమిలిపోయిండి ఆ తల్లి
సాధన సలిపింది.
అడిగింది ఆతల్లి
అపుడు వేదన తోడ
'ఈ భూమిమురణించువారల సేమ
అయినచో అబ్బాయికానరాడేల'
అనుచు దుఃఖముతోడ
అడిగింది ఆ తల్లి
అడిగింది అడిగింది
అబ్బాయి జాడ
"తన జాతి గుండెలో
తన జాతి ఇంట్లో
నిరతమూ నిలిచేటి
నిండి వెలిగేటి అతడు
అమరుడు కదా. అతడు
నిత్యుడు సుమా
అతని
నిలయము ఎప్పుడూ
అక్కడే
అతని మనుగడ ఎప్పుడూ
ఇక్కడే"
అని చరిత్ర సమాధానం ఇచ్చింది.
అంతట—

"అతను అందరిలాంటి వాడు కాడు
వాడిలాంటి వాడు ఇంకోడు లేడు
మబ్బు వీడిన సూర్యకిరణంలాగ
వాడిపోవని నిత్య మల్లి పూవు లాగ
వాడు అందరికీ ఆనందం ఇచ్చేవాడు
అయితే అంతకన్నా నే కోరే దేముంది
వాడి వల్ల నా జన్మ చరితార్థమైంది. మేలు,
వాడి వల్ల నా ఆత్మ పుణ్యభరితమైంది. చాలు."
అని
పలికింది ఆ తల్లి
పరమ సంతృప్తితో
పలికింది పలికింది
పాల కన్నీళ్లతో.

---

## గ్రంథ సమీక్ష

### మింగ్రేలియా సుందరి

### (1,2 భాగాలు)



రచయిత: శ్రీ మంత్రిప్రగడ సూర్యనారాయణ. వెల: ఒక్కొక్క భాగం 1-8-0 ప్రకాశకులు: వాణీగ్రంథమండలి, రాజమహేంద్రవరం.

నైర్‌ఋతిరష్యాలో, కాకసస్ పర్వత ప్రాంతాల్లో ఉన్న మింగ్రేలియా అనే ప్రాంతానికి సంబంధించిన చారిత్రక నవల. 1850 సం॥ ప్రాంతంలో నల్లసముద్రంమీద ఆధిక్యతకోసం జారిస్టురష్యా, టర్కీసుల్తానులు జరిపిన పోరాటాల్లో ఈ ప్రాంతం చాల బాధపడ్డది. మింగ్రేలియా ప్రభువంశీకుడు దానియల్ నాయకుడుగా ఈ కథ నడిచినది.

దొంగల నాయకులు, గుర్రపు సవారులు, హత్యలు, రహస్యమార్గాలు, అంతఃపురాలు, బానిసవ్యాపారం, మారువేషాలు, గోసాయి చిట్కాలు, కత్తియుద్ధాలు మొదలైన అన్ని లక్షణాలతోనూ ఈ నవల మొగలాయి దర్బారు, సంజీవి మొదలైన కథలల ఫక్కీలో నడిచినది. అటువంటి కథలు నచ్చినవారికి ఇదికూడా తప్పకుండా నచ్చుతుంది.

భాషను గ్రాంధిక శైలిలో నడిపించటానికి ప్రయత్నం జరిగింది.

రెండో భాగంలో చివర రచయిత వ్రాసిన కొన్ని 'కథ'లుకూడా చేర్చబడ్డవి. "దాచేను, మగడా, వేరుండు," "పెద్దవాడి పెళ్లి మాటలు," "చోరాన్వేషణము," "దొంగ దొరికాడు"—ఇవీ వాటిపేర్లు. చిత్రమేమిటంటే ఈ 'కథ'లను వ్యవహార భాషలోనే వ్రాసిన రచయిత నవలను సమీపించేటప్పటికి గ్రాంధికభాషకు దిగాడు. అయితే ఆయన గ్రాంధికరచనే వ్యావహారిక రచనకన్నా మెరుగనిపించింది.

---




## 'ప్రతిమా' నాటకం

కాంగ్రెసులో 'విశుద్ధ గాంధీ' వర్గమని ఒకవర్గాన్ని ఆచార్య కృపలానీగారు ఏర్పాట్లు చేస్తున్నారు

(శంకర్స్ వీక్లీ)




## లక్ష్యశుద్దే లేదు

ధనుర్విద్యలో హస్తలాఘువాది అనేకతంత్రాలు నేర్చిన ప్రొఫెసర్ రామమూర్తిగారు ఢిల్లీలో, కండ్లకు గంతలు కట్టుకొని, అంతరంగ దర్శనంతోనే బాణప్రయోగం చేయుట మొదలైనన విల్లంబుల తమాషాల ప్రదర్శనలు గావింపనున్నారు—వార్తావిశేషం.

(ఇండియన్ న్యూస్ క్రానికల్)

Regd. No. M. 4479

# శ్రీమద్భగవద్గీత



వ్యాఖ్యాత: శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు

ఐదవ ముద్రణము

సంస్కృతమూలము, తెలుగున టీకాతాత్పర్య విశేషార్థ వివరణములు గల 400 పుటల గ్రంథము. గీతాధ్యయన పరులకు మిక్కిలి ఉపయుక్తమైనది.






ఖద్దరు బైండు

**వెల రు 4-0-0 లు.**

తపాలాఖర్చు రు. 0-9-0.



## ఆంధ్రగ్రంథమాల

పోస్టుబాక్సు 212, మదరాసు 1.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.